# ఈ గ్రంథం దేనికి?

మంచిని కాదనడానికి కాదు. చెడుగును ఆదరించడానికీ గాదు. యీనాటి కళను అధిక్షేపించడానికీ గాదు. యీనాటి కాలప్రవాహాన్ని అడ్డగించడానికీ గాదు. కళయొక్క పరమావధిని నిర్ణయించడానికి, చాటడానికి, వ్యాపింప జేయడానికీ. కళాసేవకులమనే నేటి నటీనటుకు లందరూ సార్థక నామధేయులు, ఆదర్శ జీవనులు కావడానికి గల సావకాశాలు చూపించడానికే. ప్రకృతియొక్క శ్రేష్ఠ రచనయైన రసజ్ఞ సమాజహృదయ పేటికలో నున్న జీవకణస్పందనం గలిగించే అతీతమైన శక్తి తమలో యుందని నటీనటకులకు చూపడానికి. ఇంతేనా ?

కళారాధనలో, ప్రకృతియొక్క నిర్మల ప్రణయ రాగానికి తమ హృదయ స్పందనంతో తాళంవేస్తూ, తమ చిరుగజ్జెల స్వర్గశబ్దాలలో తన్మయులై, కళారసాస్వాదన సంజనిత తన్మయ సుషుప్తిలో కాలబద్ధులుగాని రసజ్ఞశేఖరుల కనుల యెదుట ఆదర్శ కళామూర్తులై నిలచి వారి నిరంతర వ్యథాకలిత జీవితాన్ని ఆ అనంత సౌందర్య లహరిలో క్షణమాత్రం మైమరప చేసే నటీనటుల గౌరవ మర్యాదలు కాపాడుకొను విధం చెప్పడానికి. తమ హంసనడకలకు, కోయిల కూతలకు, శరచ్చంద్ర సమాన శోభారతికి, కిలాకిలాపానికీ, సతత మందహాసంతో తొంగిచూచే రసికసమాజ మిచ్చే గౌరవా

నికీ అర్హులనడానికి, తమ నైతిక జీవితంలో గూడ నటీనటకు లాదర్శప్రాయులు కావాలని నిరూపించడానికి; అంతేగాదు—

సృష్టిలో యే శక్తిలోటువల్ల మానవ ప్రపంచం బాధ పడుతున్నదో, ఆ శక్తిని పూరించే కవి ప్రయత్నాలకు తానం వేసే బాధ్యత, వేయగల శక్తి నటీనటకవర్గాలకు గలవని చూపించడానికి. రసాయనికశాస్త్ర విజ్ఞాన ఫలితమైన వెండి తెర యీనాటి నటీనటుల కళాప్రదర్శనం ఒకరాత్రితో క్షణి కమై నశించేది కాదని ఋజువు చేసింది. శతాబ్దాల తరబడి ఆ కళావస్తువును భద్రపరచి పలుమారు రసపిపాసులగు ప్రేక్షకవర్గాల కళాతృష్ణ తీర్చవచ్చునని తెల్పింది; ఆ అనశ్వర మైన వెండితెర వెనుక దోబూచులాడే నటీనటకులు తమ భవిష్యత్తు తెలిసికొని కళంకరహితమై, స్వచ్ఛందమైన ఆదర్శ జీవనులు కావాలి. రానున్న కాలమునకాని కి వాగ్బంధనం గావించే నైర్మల్యం తాము సంఘానికి కనబరచాలి. భీకర కాలతరంగముల తాకిడికి చెల్లాచెదరుగాక, కఠిన మానవ పరీ క్షకు కరుగక, కగ్గక, సానపట్టినవజ్రమువలె, కాళిదాసు కావ్య ములవలె, ప్రతినటీ ప్రతినటకుడు తమ కళాకాంతులతో ప్రజ్వ రిల్లాలని గుర్తింప చేయుటకు. ఇంతేగాక—

దినదినాభివృద్ధి గనుచున్న మన సినిమాకళలో వ్యాపార దృష్టితో, ధనాశా పిపాసతో 'నిజదార సుతోదరపోషణార్థమై' కాలుపెట్టేవారు, కళాదృష్టితో ఉన్న తాశయాలతో కృషి చేసే తోటి కళాకృషీవలుల స్వచ్ఛంద కీర్తికి భంగకారులు. అట్టివారికి కళాపీఠాధిపతులు సంస్కారులగు నంతదనుక

స్థాన మీయరాదని తెలుపుట కీ గ్రంథ ముపకరిస్తుందని నా ఆశయం. యీనాటి నటీనటకవర్గం తమపై నున్న అగావులను తొలగించుకొనడం, దుష్టకాలము వెండితెరకు తెచ్చిన చెడు పేరు పోగొట్టడం కేవలం కళారాధన వల్లనే సాధ్యం. నైతిక జీవనం గూడ కళారాధనకే, ఆదర్శ జీవితానికే వన్నెమాట మరువరాదు సుమా! ఆధునిక సినిమా స్టార్సును గూర్చి ముచ్చటిస్తూ ఒక వారపత్రిక తన సినిమాపేజీలో ఈవిధంగా వ్రాసింది. 'త్రాగుడు, తందనాలు త్రొక్కడం, శారీరక వాంఛలను శుద్ధ పశువుల్లా తీర్చుకోడం, జూదం, గుర్రపు పందేములతో కాలం గడుపుతున్నారు. వారనుభవించేది అసభ్య మార్గాలతో కూడిన జీవనం. తారలు తమ కళాప్రతిభతో తమ అభినయ విభ్రమంతో, తమ గాన మాధురీ ఝురులతో మాత్రమే ప్రేక్షకుల నుర్రూత లూగించడంతోనే వారి జీవిత పరమావధి పరిసమాప్తి కాదు. వారి నాదరించిన సంఘానికి. అపార ధన సంపదల నిస్తున్న సంఘానికి వారెంతో ఋణపడి యున్నారు. సంఘసేవే వారి కళాధర్మం. ఆధర్మాన్ని గుర్తించి ప్రవర్తించగలిగిననాడే వారి కళాజీవితాలు ధన్యతమా లవు తాయి.' దీనిలోని ప్రతి అక్షరం అర్థయుక్తం. సత్యం అన డంలో సందేహం లేదు. ఈ వాక్యాలు గొప్ప అనుభవవేత్త హృదయ పేటికలోంచి వెలువడ్డ సత్యాలు. ప్రతి విజ్ఞానికీ, లోకజ్ఞానికీ యిది తెలిసిన విషయం. యీ నలుపు తుడుచు కుంటానికి కావలసిన సాధనసంపత్తి చేకూర్చుటయే యీ గ్రంధముయొక్క పరమావధి.

'Do not visit talkies, nautch parties or any place where there is vulgar music or dance' అనివేనోళ్ల ఘోషించే ఒక ఉత్తమయోగి వాక్యంలోని అర్థం గొప్పది. దురలవాట్లను బహిష్కరించుటకు విద్యార్థికిచ్చే హితోపదేశమే గాక, ప్రస్తుతం వెండితెరకు బట్టిన అధోగతి కూడా సుబోధకం చేసే యీవాక్యం ప్రమాణ వాక్యంగాక మరేమి? ఇలాంటివి లక్షోపలక్షలు. ఈ గురిగింజ నలుపు కాలగర్భంలో కలిస్తే గాని మన నటీనటుల కళాతేజం, నివురుపోయిన నిప్పువలె నిగ్గుతేరి తేజోమయం గాదని చాటటమే నా యీ గ్రంథంయొక్క లక్ష్యం.

ఈనలుపు నశించే దెట్లు? నటీనటకులు, ప్రేక్షకులు, నిర్మాత దీర్ఘసుషుప్తినుండి మేల్కాంచు టెట్లు? మార్గముందా? శరశ్చంద్ర సముజ్వల జ్యోత్స్నా ప్రసరం లాంటి కళాభిరతిలో ఆనందించరాదా? చంద్రునిలోని మచ్చను జూపుట రసజ్ఞ లక్షణమా? అను ప్రశ్నలకు మచ్చలేని చంద్రుడు కళంకయుతుడైన శరత్ చంద్రుని కంటె వేయిరెట్లు మెరుగు గదా? అదిగాకుంటే మాత్రం తొలగింపవీలగు దోషము తొలగింపక ముద్దిడుకోడం యెందుకు? నటీనటులు కళా తన్మయతలో యీ కళంకములు కప్పిపుచ్చుటకంటె వీనిని తొలగించుకునే ఉత్తమ మార్గాలు బోధించడమే యీ గ్రంథాశయం. విస్తర మగునేమో? యీ గ్రంథోద్దేశాన్నే నొక్కివక్కాణించిన ఆర్మీ సార్జెంట్ A. T. ఇస్మాన్ యను కళాప్రియుని వాక్యంతో ముగిస్తాను. 'ఇండియా చలన

చిత్రనిర్మాణానికి గల అవకాశాలకు పరిమితి లేదు. నిర్మాతలు అహర్నిశలు చలనచిత్రాలను తయారు చేస్తున్నారు. అయితే చిత్రకళకు ప్రాధాన్యమిస్తూ వ్యాపార రీత్యా లాభార్జనా కాంక్షను కొంతవరకు తగ్గించి కృషి చేస్తే తప్ప ఇండియాలో తయారయ్యే చిత్రాలు బ్రిటిష్, హాలీవుడ్ చలనచిత్రాల అంతస్తును అందుకోడం కష్టం! రష్యాలో విద్యాభివృద్ధికీ, ఇటలీలో (1924 లో) వ్యవసాయాభివృద్ధికి ఉపయోగించిన వెండితెర మనం వ్యాపార లాభాల కుపయోగించుట మరింత నీచమైన పని. ఉత్తమాశయం కళాభివృద్ధిగాని, మిగిలినవి కావని చాటుటే గ్రంథ లక్ష్యం.

ఇట్లు

రచయిత

# నామాట

భగవత్ సృష్టియైన యీప్రపంచంచాలక మానవుడు మరో ప్రపంచం సృష్టించాడు. ఇదే ఫిలింజగత్తు. ఈకల్పితలోక మొక వాయుసౌధం. ఆవాయు సౌధాలలో ఆవాయు తరంగాలలో తన్మయుడై మానవుడు కొన్నియుగాల ముందుకో వెనుకకో పోయి తొంగిచూస్తాడు. నాటిప్రకృతిని స్వర్గసౌధమంటే యిదీ. రంభాకౌగలింతసుఖం కలిగిస్తుందని కలలుగని యులిక్కిపడతాడు. రాయలనాటి విజయనగరాన్ని హంపీ క్షేత్రాన్ని కనులారచూచి ఆనందాశ్రువులు విడచి, శిథిల హంపీ శిలల తనబాష్పబిందువులతో స్త్రపనచేస్తాడు. ఈకల్పిత జగత్‌లో పచేరంచేసి స్వచ్ఛంద మానసుడై స్వర్గోన్నతిని పొందుతాడు.

అట్టి యీచిత్ర జగతిని విమర్శించడం విమర్శింపబూనడం సాహసకృత్యం. ఐనా, నెలబాలునకు నూలుపోగువలె యీగ్రంథ కుసుమం కళాదేవిపాదాలకు కానుకగాయిస్తాను. యీకృతిజ్యోతితో కళాకుమారిని లోకానికి చూపయత్నించడం, దినకరునిదివ్వెతో చూపసాహసించుటే. అనుభవేత్తలు, పండితులు, కళారాధకులు వ్రాసినగ్రంథకుసుమమాల తన కంఠమాలగా ధరించిన కళాదేవి నా యీ ప్రసూనాన్ని తన పాదాల కేనియర్పింపనీదా? అదియే సార్థకమని సంతోషిస్తాను.

కళాలోకానికి క్రొత్తవికాని యీ అభ్యుదయ మార్గాలు అత్యుత్తమాశయాలు అర్థంలేని మాటలదొంతరని పెదవివిర వక సంవిధానంలో అదిచెక్కిన నగయని కళాప్రియులు గ్రహింతురని నాదృఢనమ్మకం. కళాదేవి కాలి చిరుఅందెమై యీ గ్రంథము కళాలోకానికి నృత్యములు నేర్పుగాత!

ఆల్ యిండియా ఫిలిం కౌన్సిల్ స్థాపన కావాలి. వూరూర దేవాలయమువలె, చిత్రకళా మందిరమూ అవసర మనే వారిలో నేనొకడను. అయితే మన చిత్రనిర్మాణసంస్థలు యీ కళా మందిరాలన్నిటిలో దీపారాధన చేయగలవా? అను మానాస్పదం. కాని సంగీత కళాశాలలు స్థాపించి తద్వారా చిత్రకళాభివృద్ధికేగాక అధికచిత్రోత్పత్తికి కూడా తగినసావ కాశం కల్పించితే పై కార్యం సుసాధ్యం.

అనుభవేత్తలగు కళా ప్రియులు పంపు సలహాలు భావాలు మున్ముందు కూర్పులలో అనుసరించటమే గాక ప్రచురించుటకు గూడ సంసిద్ధుణ్ని.

ఇట్లు

**రచయిత**

# అభిప్రాయములు

ఆచార్యవర్యా !

తమ 'వెండితెర'ను ఆమూలాగ్రంగా నాకు చూపిస్తూ, వినిపించారు.

ఆదినుంచి అంతందాకా ప్రతి పదంలోనూ యిమిడి వున్న మీ లోకాదర్శక కవితోద్వేషమాన భావసంపద, యథార్థ విషయ నిరూపక తత్వము, అవసరమైన ఉత్తేజాన్నిచ్చే సంఘ సంస్కరణాభిలాష, కళాపోషణలు మాంత్రికశక్తులై నాలాంటి వ్యక్తుల కెందరికో నవజీవనాన్ని ప్రసాదిస్తాయి.

సముద్రమథనంలోంచి బయటబడిన అమృత విషాల్లాగా మీ 'వెండితెర'లోని వెలుగు చీకట్లు భావికాల సంఘోద్ధరణాభిలాషులైన రసజ్ఞ ప్రేక్షకులకూ, నటులకూ, దర్శకులకూ విచక్షణాశక్తిని ప్రసాదించే దేవవరంలాగా ఈ గ్రంథముపకరిస్తుందనడంలో అతిశయోక్తి మృగ్యం.

వ్యయప్రయాసలకు లభ్యంగాని ప్రాపంచదృశ్య వీక్షణానికీ, అదృష్టహీనులైన రసజ్ఞ బాహ్య మనోనేత్రాలకు ఈ 'వెండితెర' ఒక దివ్యాంజనంలాగాను, విమానంలాగానూ తోడ్పడగలదని చెప్పుచున్న మీ యున్నత భావంతో నేను హృదయపూర్వకంగా యేకీభవిస్తాను.

ఒకటేమిటి ?—ఇందులోని అన్ని భావాలతో యేకీభవిస్తూ యీ కవినే నేనై ఆనందిస్తూన్న నేను ప్రత్యేకాభిప్రాయం వ్రాసేదానికంటే, యీ గ్రంథాన్నే ఆమూలాగ్రంగా

చదివి ఆనందించమని కోరడం వుత్తమోత్తమ పద్ధతిగా రసజ్ఞులకు మనవి చేస్తున్నాను.

తెనాలి
20—7—1945

ఇట్లు
స్థానం

ఆర్యా!

మీ వెండితెరను జూచి ఆనందించితిని; వెండియు,

గీ॥ హాసభావంబుతోడ సోయగము మీర
మృదుపదంబులు గల్గి యమృతము లొల్క
మంజుభాషల నడకల మదికి సమ్ము
దంబుఁ గూరిచె మీ కవితాకుమారి.

మరియు, మీ కవితావధూటి నవ్యభాషా విభూషణా లంకృతయు, రంగస్థల సముచిత నృత్య గాన రసా విశేషణ ములకు మార్గదర్శియు నయి అధునిక మానవాహ్లాదమును గలి గించు ననుటయం దతిశయోక్తి లేదు.

అది యట్లుండ, వ్యాపారతత్వమునకు 'కళ' బలియగు చున్న యీ కాలమున కళోపాసనకు, కళాభివృద్ధికి వేనోళ్ళ ఘోషించు మీ గ్రంథము కళాలోకమునకు కాంతిదాతి యగుచున్నది. మీరిచ్చిన నటక శబ్దార్థములతోను, మీరు సూచించిన కళాభివృద్ధి మార్గాలతోను, నేను హృదయపూ ర్వకముగా యేకీభవించుచున్నాను.

సందర్భోచిత సంస్కృతాది లోకోక్తులతో నిండియున్న ఈ గ్రంథము మీ గీర్వాణభాషాపరిచయమే గాక మీకుఁగల లోకానుభవమును వెల్లడించుచున్నది.

ఇదియుఁగాక ఆంధ్రభాషయందు మీచే రచియింపబడిన పద్య గద్యాదికమును, మీకు హూణ భాషయందు గల పూర్ణ పాండిత్యమును గని పిన్నవయసునందే మీకిట్టి శక్తి గల్గుటకు సంతసించుచున్నాను.

అనతికాలముననే యీ గ్రంథము, రసికజనాదరణీయమై ఈదృశానేక గ్రంథరచనకు ప్రోత్సాహ మొసంగుగాత.

కర్లపాలెం.
1—1—1946

ఇట్లు
మహాభారత ధర్మాదిగ్రంథ ప్రణేత
పన్నాల వేంకటసుబ్బరాయశర్మ

మిత్రమా!

చికిలి ముత్యాల నగిషీలఁ జెన్నుమీరి,
శారదాజ్యోత్స్నలం దలరారుచుండు
తారకా రాజితాకాశ ధవళిమలకు
'వెండితెర' మీను తూలిక వేయుగాత!

దూ. వేం. కృ. రాఘవాచార్య
బి. ఏ. ఆనర్సు విద్యార్థి
ప్రసూనాంజలికర్త

# మాతృస్మృతి

స్వర్గ సౌఖ్యాసక్తయై తన బాహుడోలికాతల్పమనే స్వర్గధామంనుండి

నిర్దాక్షిణ్యురాలై, శైశవావస్థలో నున్న నన్వీడి

పరలోకగతురాలైన

**నా కన్నతల్లికి**

నా కన్నీటి కాన్క

# సమర్పణము

నీలంపు తెరయగు నిర్మలాకాశాన
బంగరు పూలను పరచు నెవడు
పచ్చనై నేత్ర సుపర్వమా ప్రకృతి కొ
ప్పున రంగు పూలను ముడుచు నెవడు
చిత్రజీవుల నెన్నో సృజియించి మధుర ని
స్వనమున వానిలో పాడు నెవడు
శూన్యమై వాయువుఁ జొరబడి జడమేని
చేతనమునుగాగ జేయు నెవడు

శిల్పి జేబట్టు శిల వెన్న జేయు నెవడు
చిత్రకారుని చేకుంచి జీవ మెవడు
నటుని సంగీత గీతానినాద మెవడు
యతని కర్పింతు నే నమస్కృతము సతము.

శ్రీ లక్ష్మీనరసింహుడు
పాలించును గాత మిమ్ము భద్రముగాగ
మేలగు జయసంపదలను
తాలిమి సత్కీర్తు లిడి సతంబు కృతీశా !

ప్రకృతి లీలా వినోద సంపదల గాంచి
హృదయవీణాపు తంతులు కదలి పాడ
శృతిని రాగంబువోలె ప్రకృతిని నీవు
వీడకుందువు రసికుడా ! వీడలేవు.

కన్నులు విప్పు తామరను, కామిని చేతి గులాబిపూవునన్
మిన్నున తారలన్ గని నిమీలితనేత్రుడవై రసాగ్రణీ!
'ఎన్నగ పాడుజన్నమిది ఏసుమమైననుఁ గాకపోతి ఛీ!
మన్నయిపోను నీచమగు మానవ జన్మమటంచు తిట్టెదే!

పూమధువుగ్రోల భృంగమై పుట్టినావు
ముందుజన్మల పుష్పమై మురియగలవో
గగనమున తారవై మాకు గానబడుదో
చెప్పగానౌనె సృష్టివైచిత్ర్యగతుల.

'చిత్రవర్ణాల ప్రకృతిని జేరదెచ్చి
నవరసంబుల వానిని దవిలి కలిపి
భావకుంచెను తేజము ప్రజ్వరిల్ల
వెండితెర వ్రాసె మనుమడు వింటరెడ్డి.

అనుచు ననికెపల్లి యాగ్యాడు మాతాత
జ్యోతిషజ్ఞుడెంతో నీతియుతుడు
ఆర్యనుతుడు కృష్ణమాచార్యనాముడు
బలుక నాడు కడకు బయనమెతే?

వీరసింహంబులై రణభేరి మ్రోయ
యుద్ధరంగాల విహరించి యుష్ణరుధిర
మోడ్చియైనను జయలక్ష్మి దోడితెచ్చి

మేలు మేలన రాజ్యంబు నేలినట్టి
రెడ్డి వంశంబునీది గర్వింపరాదె.

కత్తిచేపట్టి కదనరంగాల దూమికి
విజయలక్ష్మిని పొందిన వీరరెడ్లు
గంటమున్ ద్రిప్పి కవితాగ్ర గణ్యులౌచు
ఏలగా లేదె ముప్పదివేల మైళ్లు?

కృతినాధుడౌచు శాశ్వతకీర్తి గడియించె
ప్రోలవేమారెడ్డి పుంగవుండు
క్షితిని 'వసంతరాజీయం' బొనర్చె కు
మారగిరి నృపుండు పేరుగాంచె
'శృంగార దీపిక' చెల్వార వ్రాసి పే
ర్గనె వేము భూపాల కవివరుండు
సరస వ్యాఖ్యను వ్రాసి 'శాకుంతలము' నకు
కాటయ వేమన ఘనత కెక్కె

ఉభయభాషా ప్రవీణత నుర్విబరగి
కత్తిగంటాలు కరముల గంతులిడగ
తెలుగు బాసకు కవితకు తెచ్చివన్నె
రాజ్యమేలిరి రెడ్డి సామ్రాట్టు లెలమి.

కృతిగొనుటల్ రచించుటలు కీరితిగాంచిన మేటిరెడ్డి భూ
పతులకు క్రొత్తగాదు తలపన్ నవపల్లవ కోమలంపు స

త్కృతిలత కల్లుబెట్టి కడు తేజముగూర్చి తెలుంగు బాసకున్
చతురత నూరువర్షములు శాంతిగ నేలగ లేదె రెడ్లు మున్.

దానధర్మ నిరతుండు సు
జ్ఞానియు బుధశాలి రామచంద్రారెడ్డే
యానాటి నూాల పురుషుం
డీనాటికి కీర్తిశేషుడిల ధన్యుడహో

సరసగుణాలయుండు బహుసానువు తాతగు చెంచురెడ్డి సుం
దరనవమన్మథాంగుడు సదానుడు ధార్మికమూర్తి లోకభీ
కరయమపాశబద్ధుడయి కాలముతీరి గతించు వేళ నిన్
జొరగనె తద్గుణశ్రుతము సుందరరూపుడ! రెడ్డివర్యుడా!

సంతత మందహాసరుచి చల్లనిదృక్కు దయార్ద్రభావమ
త్యంతరసానుభూతి హృదయంపు విశాలతగల్గునిన్ను న
త్యంత ముదంబునన్ గనిచి రా మహాలక్ష్మమ రామిరెడ్డితా
మెంతటి భాగ్యశాలురో నుతింపగ శక్యమె? యెరికేనియున్

మీయన్న కృష్ణరెడ్డియు
ధీయుతు డౌదార్యఘనుడు తిలకింపంగా
రాయుల వంశము మీయది
గాయకకవిపోషణలకు కవిరాజనుతా!

విద్దెయు రూపసంపద వివేకములున్ గలయట్టి వారు నీ
ముద్దుల సోదరీమణులు మోదము గాదె క్షితీశ! యింక నీ

యిద్దరు భార్యలఁ గురిచి యేమని పల్కెద సత్య రుక్మిణుల్
పద్దుగ మీగృహంబు కనుపంతువ గాదొకో? రెడ్డివంశజా!

తలపక కీడు నేరికి సతంబు సరస్వతిపూజ సల్పి, మా
కలగని గర్వమందక 'సుఖమ్మున కయ్యది సాధనంబు' చం
కల నిటు గొట్టనేల? కల కాలము నిల్చునె? సంప దంచు ని
చ్చలు జగమందు చాటు గుణశాలివి నీవు కృతీశ! సత్యమా.

పిల్లనగ్రోవి నూది మరపించెను గానస్రవంతిలోన నా
గొల్లల గోవులఁ మునుపు గోకులనాథుడు: నేడు మీరు మీ
చల్లని దృక్ప్రసారపు రసంబును గోవులకిచ్చి మానసో
త్ఫుల్ల వికాసనంబునకు తోడ్పడుచుంద్రి రసైక శేఖరా!

పాలకవర్గ మేలి తమ పంచన నించుక విశ్రమించి, స్వ
ర్గాలయ మన్నదిద్దె యహహా! యనిగజ్జువ త్రేపుకొంచు తాం
బూలము చేతబట్టి రసపోషక! మా సుకృతాన నిగ్గె మీ
ప్రోలనునిల్చు భాగ్యమన, మోదము నెంచుట దేటిభాగ్యమో!

అడిగినంతనె యర్థుల హస్తమునను
తృణమొ ఫలమిడి వారల తృప్తిపరచి
దానకర్ణుండవను పేర దనరినావు
ధన్యమా మార్గమిది కృతిధవుడ! నిజము.

అభినుతు లేల? పుణ్యక్షేత్ర యాత్ర లే
భక్తుడవని నిన్ను పలుకవొకో?

సంస్తుతులేల ? భాషాసేవయే పండి
తుడవను బిరుదంబుఁ దాడగ దాళ్కా ?
నుతులేల ? నీకు సంస్కృతసంస్థ పోషణే
రసికుడవను నామ మొసగ దాకొ!
స్తోత్రంబులేల ? యర్థుల కోర్కె దీర్చుటే
మేటిదాత వటంచుఁ జాటు దాకొ ?

పొగడగా నేల నో రెడ్డిపుంగవుండ
రెడ్డివంశంపు మర్యాద గడ్డకట్టి
వ్రాలె నీయందు చెంచు గోపాలరెడ్డి
కీర్తి మను మాచంద్రతారకముగ.

ఖడ్గహస్తంబున కవుల శాశించు త
ర్కము, ధర్మశాస్త్రము గాదు కాదు
వాటుకందని సమానాక్షేప కల్పిత
కావ్య ప్రబంధమ్ము కాదు కాదు
పద్య గద్యమ్ముల పలుకు పదునుగాగ
కల్పివండిన నాటకమ్ము గాదు
జాను తెనుగుసుమజాలతో నల్లిన
ఖండకావ్యంబును గాదు కాదు
తేటతెల్లంపు తెలుగున తీర్చి దిద్ది
వ్రాయబడిన విమర్శన వాక్యములివి
'వెండితెర' యను పేర నావిర్భవించె
'అర్పణము' సేతు గైకొనుమయ్య రెడ్డి !

కృతిగొని నాదు కావ్యము సుకీర్తి గడించితె రెడ్డివర్య! భా
రతి కరుణావిశేషమున రాజిలుమయ్య సుఖంబు మీర నీ
సతు లనురాగ సంతతు లొసంగగ దిగ్విజయుండ వౌచు; ధ
న్యత గనినాడ వో రసికనాయక! కీర్తిధనంబు నీదెపో.

కరుణ రసార్ద్రి చిత్తులయి గాయకులున్ కవివర్యులౌచు శ్రీ
హరి చరణారవిందము లహర్నిశమున్ మది నిల్పి భక్తి త
త్పరులన జెల్లు పండితుల భక్తులకున్ నిలయంబ యైన మీ
వరకవిప్రూడి రాయలసభన్ మరపించు రసజ్ఞశేఖరా!

హరిహర కమలభవాదులు
సిరి శుభ దీర్ఘాయు లొసగి క్షేమముమీరన్
ధర మిమ్ము సాకు నో కృతి
వర! సత్సంతతిని గలిగి వాసిని గనుమా!

# వందనాలు

కాలం మునుపటి కాలంగాదని నేను వ్రాయడం మనవసరం. 'కృతిసమర్పణ' ఆధునికయువకలోకానికి క్రొత్తమాట. భోజునిగాథ ఎంతస్వప్నగాథగా కాలతెరల మంచుపొగలలోనుంచి గన్పడుతోందో, కృతిసమర్పణకూడా దాదాపు అంత పురాతన స్వప్నకథానికగా మారింది. అయితే దీనిలో కొంత యుత్ప్రేక్ష లేక పోలేదు. నిజానికిందులో యుత్ప్రేక్ష మృగ్యమే కాని కళాప్రియులైన ఈశ్వరవాకచెంచు గోపాలరెడ్డిగారు మొదలైనవారు కావ్యకాంత కరగ్రహణంలో తరగని యాశక్త్యభిలాషలు చూపడం పై శాసనవాక్యానికి ఉత్ప్రేక్ష ఉపపాదించింది. యుద్ధబీభత్స ఫలితంగా వళ్లుపెంచి, భీకర రూపాలు దాల్చిన పరిస్థితులు కూడా రెడ్డిగారి కర్ణహస్తాన్ని వెనుదీయనీలేదంటే వారికి నేనెంతో ఋణపడ్డానని భావిస్తాను. శ్రీ రెడ్డిగారిని, వారి కుటుంబీకులను, సంపూర్ణాయురారోగ్య సంపన్నులుగా జేయుట్టకా కళామూర్తియగు పరమేశ్వరుని ప్రార్థిస్తూన్నాను.

ఈ సాహిత్యయుగంలో భాషాసేవకు యేర్పడ్డ సమితులు, మండలులు, పరిషత్‌లు మొదలగునవి నిజంగా కవులకు నావలవంటివి. వీనిలో చాలావరకు భాషాసేవకు నడుంకట్టినవే కావడం మనభాగ్యం. అలాంటి సంస్థల్లో విశ్వజ్ఞమండలి యొకటి. వారి ఆశయాదర్శాలు వారిప్రథమ పుష్పమైన 'శ్లేషరమాల'లో కన్నుల కట్టినట్లు కనపడతై. సంపాదకుని

'ఆశయం' అనే శీర్షిక క్రింద ముఖ్యంగా. ఈరోజుల్లో శిల్పకళ అంతరు వొందింది. చతుష్షష్టి కళలలో సజీవములై ఈయుద్ధా నంతరంకూడా తలఎత్తి తిరుగుతున్న కళలు చాలాకొద్ది. మరుగుపడ్డ వానిలో శిల్పకళముఖ్యమైంది. ఈకళా పోషకుల చరిత్రకూడా వాఙ్మయసముద్రంలో కూరుకపోయింది. ఈస ముద్ర మథనంగావించి కాలగర్భపు పాలైన కళారాధకులగు శిల్పుల చరిత్రలను పరిశోధింప యత్నించుచున్న యీ సంస్థ నాయీ వెండితెరను కళాభియుత గ్రంథమని స్వీకరించడం నా భాగ్యం. సంపాదకులగు పలేశ్వరపు బసవయాచారి గారికి నేనెంతైనా కృతజ్ఞుణ్ని.

బాగోగులటుంచి, బాలరచయితనని యో, మరేకార ణంవల్లనో, నాగ్రంథాన్నామూలాగ్రంగా నాచే చదివించి ఓపి కతో, శ్రద్ధతో, ఆసక్తితోవిని, అధికంగా ప్రస్తుతించి, గౌర వించి, మిక్కిలి భావగర్భితమైన పదాలతో తనభావాన్ని వ్రాసియిచ్చిన కళాకోవిదులగు శ్రీస్థానం నరసింహారావుగారి మేలింకో వందజన్మములకు కూడా మరువలేను.

కావ్యగోష్టిలో గాలిపీల్చుటకు కూడా తీరికలేని సమ యంలో నాయందలి యభిమానంచే, నాగ్రంథ మాఖరిపుట వరకు సవిమర్శగా పరికించి తమ భావమొసంగిన మాగురుతు ల్యులు మహాభారత ధర్మాది గ్రంథప్రణేతయు, బ్రహ్మజ్ఞానులు నైన బ్రహ్మశ్రీ పన్నాల వేంకటసుబ్బరాయ శర్మగారికి నాహృదయ పూర్వక నమస్కారములు.

ఈ సందర్భంలో, సమానవయస్కు డగుటచే చేతులు జోడించక పోయినా, నావెండితెరను అంగుళం వదలకుండా చూచి తనభావం పంపిన నాసోదర సమానుడును, అముద్రిత మైన ప్రసూనాంజలి గ్రంథకర్తయు నగు బి. ఏ. ఆనర్సు విద్యార్థి శ్రీ దూపాటి వెంకటకృష్ణ రాఘవాచార్యులకు నా ప్రేమ పూరిత ఆశీస్సులు.

రసికవర్యులగు శ్రీ రెడ్డిగారితో ప్రథమ పరిచయం గావించుటయందు సాయపడ్డ మాతాతగారును జ్యోతిష శాస్త్రనిపుణులునుఅయిన శ్రీ అనికేపల్లి కృష్ణమాచార్యులు గారికి నా అభివందనములు.

బడుగుపనియగు ముద్రణా విషయమున, కళాశాల విద్యార్థుడనగు నాకు తీరికలేమి, తోడుపడి పలువిధముల నాకష్ట నిష్ఠురముల పాల్గొని సాయపడిన ఆయుర్వేదాచార్యులును, శ్రీ వైఖానస గ్రంథమాల సంపాదకులును యగు శ్రీ దీవి కృష్ణభట్టాచార్యుల గారికి నేనెంతైనా కృతజ్ఞుణ్ని.

నన్నుమిత్రంగా ప్రోత్సహించి, నాగ్రంథాగమనాన్ని నిరీక్షిస్తూ నాకుత్సాహం కలిగించిన నాసోదరులు శ్రీ దీవి శాయాచార్యులుగారు, శ్రీ శ్రీనివాసుల సత్యనారాయణా చార్యులుగారు, నామిత్రులు అక్కరాజు రాఘవరావుగారు; చుండూరు రామకృష్ణరావుగార్లకు నా వందనాలు.

హృదయాన్ని సూటిగాతాకి చైతన్యంగాని తన్మయం గాని కల్గించేది చిత్రకారుని హస్తనిర్మిత చిత్రం. దీనికి ఉదాహరణ నాగ్రంథ ముఖచిత్రం (Frontis Piece) కళారాధన

దీనితో పాటు ప్రాజెక్టరుయొక్క స్కెచ్ వ్రాసియిచ్చిన శ్రీ మంత్రవాది వెంకటరత్నంగారికి ఈ సందర్భంలో అభివాదనా లర్పిస్తాను.

'ఈ గ్రంథం దేనికి?' అనుశీర్షిక క్రిందగాని, గ్రంథసామగ్రి కొరకుగాని కొన్ని గ్రంథముల నుండియు, పత్రికలనుండియు సంగ్రహించబడిన విషయాల కా యా పత్రికా సంపాదకులచేత క్షంతవ్యుణ్ని.

# వెండితెర

'Music is the eye of the ear' సంగీతం కర్ణ
నేత్రం అని ఘోషించే ఆంగ్ల సామెతలో ఎంతైనా అర్థముంది.
కాని అది కర్ణపేయమైనపుడే కర్ణనేత్రమౌతుంది. దానిలో
యున్న మహత్తేదో కాని ఎలాంటి పాషాణహృదయాన్నయినా
వెన్నవలె కరగించి తేనెలాగు తీయబడేస్తుంది. సంగీతంలో
కూడా జీవంగలసంగీతం, రసరాహిత్యగానం అని రెండురకాలు
సామాన్యంగా కనబడుతూంటాయి. జీవంగల సంగీత మంటే
తొక్కతొక్కిన తాచులాగు బుసలుకొట్టడం కాదు; జీవస్మృతి
సర్వాన్ని తలలూపజేసే పాములాడి వెర్రివిదళింపు గాదు; లేక
అర్ధరాత్రివేళ నిద్రాభంగం గలిగించే మార్జాల ద్వంద్వకలహ
మూ కాదు; దడదడలతో తల్లటిల్లజేసే గాలివాన స్రోతలూ
గావు. మరేమిటి? అది యొక రసధారాస్రవంతి. వయ్యా
రంగా కట్టలు వాటక సళ్ళుబ్బంగా ప్రవహించే నిర్మల జలప్రవా
హం. వసంత రసాలపల్లవఖాదియైన అగ్రదూతిక యొక్క
కూకూ ధ్వని. తడబడని సుకుమారి హంసకడకల మంజుల
నాదం. ఎల్లప్పుడూ ఏకధారగా పర్వతాగ్రమునుండి దుముకు
చుండే జలపాత గీతారవం. అదీ జీవంగల సంగీతం. ఇక రస
రాహిత్యమైన పిప్పికేమి? అది మన నక్కబావ కాకిబావచే
పాడించే పాట. అందులో స్వారస్యం మృగ్యం. చెఱసాలఖైదీ

తన నీ విశాల ప్రపంచంనుండి వేరుపరచిన ఆ నాలుగు గోడలు
దాటి స్వేచ్ఛావాయువులు పీల్చుదామనే యాసతో అందుబా
టులో యున్న యినుపకమ్మీలకు తల మోదుకుంటుంటే కలిగే
శబ్దం చక్కని యుదాహరణం. రసరాహిత్యసంగీతం పసలేని
పచ్చిమెరపకాయ. సంగీతంలో ఘాటు (Flavour), మృదుత్వం,
స్వరభేదం, స్వరస్థాయి, మాధుర్యం మొదలగు లక్షణాలన్నీ
సమయానుకూలంగా అవసరమే. కేవలం, ' సరిగమ ' సంగీ
తాన్నే ఆదర్శంగా తీసుకోవడంలేదు. భావవిన్యాసంకై, గాలి
సంగీతమనే పేర ప్రజాహృదయాల నాకర్షించిన నవ్యగానానికే
ముఖ్యంగా పై విషయాలు కేంద్రీకరించ బడ్డాయి. చూడండి,
వసంతకాలంలో జలదపటలాలమధ్య దోబూచులాడే చం
ద్రునిచూస్తే, పతిరాలేదని చింతించే సతి నవనీతహృదయానికి
కోకిల కూకూ గీతికలు ఎంత ఆహ్లాదకరంగా వుంటాయో;
ఆమెలో ఎన్నియూహలు కలిగిస్తాయో; అది యెంత దూరాన
కూయుచున్నా సరే ఆ యిల్లాలికి తన మానసోద్యానవనంలోని
ప్రేమరసాలాగ్రంపై కూర్చొని కూస్తున్నట్లుగానే యుంటుంది.
సంగీతంలో అంతశక్తి యుంది.

సంగీతకళారాధకుడు కూడా ఆ విద్యామానాన్ని కాపా
డడం కోసం కొన్ని ముఖ్యమైన విషయాలు గ్రహించి యుం
డాలి. విజ్ఞానసిద్ధమైన నటుడెప్పుడూకూడా తన విద్యలోసలోపాలు,
లోటుబాట్లు సవరించుకుంటూనే యుంటాడు. ' గాంధారంచ

కవిత్వంచ శూరతా దానశైలతా' యీ నాల్గూ పుట్టుక తోనే వచ్చేవనికూడా గ్రహిస్తారు.

కొందరు నటకులు గళం గంగాళంచేసి వ్రిరివెంగళాయి రాగాలు కల్పించి, రాగమిశ్రమంచేసి, గానగృహద్వారం పూర్తిగా తెరచి, బహుఅందవికారపు వేషాలు వేస్తారు. చెవులు పోనేటట్లు గొంతు చించుకొనడంలో మాధుర్యత అట్టే కనబడదు రసపిపాసకులకు. అంతదాకాదేనికి ? ప్రస్తుతం యీ స్టూడియోలచుట్టూ తిరిగే చిలకలలోను వెండితెరపై మెరిసే శీతాకోక చిలుకలలోను ఎలాంటి సంగీతం ఆహ్లాదకరంగా యుంటుందో ఓర్పించండి. శాంతంగా ఒకటేస్వర స్థాయిలో పల్లు కనబడకుండా ముత్యాల సగలొత్తివలె కళలవర్షం కురిపిస్తూ, అవసరమైనప్పుడు పింఛంవిప్పిదిచ్చుబుద్ధి ప్రతాపంచూపే గానం దిగ్విజయంగా లంచాలు లేకుండా ఛైర్ (Chair) ను పొందుతుంది. గానవిద్య అపారమైనది. దానినికూర్చి, భావగీతాలేమి? గాలిమేడలేమి? ఎన్నైనా అల్లవచ్చు. కాని గ్రంథవిస్తరభీతిచే యింతటితో యీ ధోరణి ముగించి తెరపైకి టార్చివేస్తాము.

చూడండి! వెండితెర నేడు ఎంత కాంతివంతంగా వెలుగుచున్నదో! ఒకనాడు కాగడాలపై ఆముదంపోసి వెలిగించి, ఆ వెలుగులో తోలుబొమ్మలను నడిపించిన మనము, ఆ అజ్ఞానపు తెరలు చించి, చిన్నపందిరిపాకా నిర్మించి దానిమీద బూడిదపూసికొన్న తోలుబొమ్మలను ఆడించాము. అదీకొన్నా

ళ్లకు అసహ్యమనిపించింది మనకే. సరే ఏదెట్లైనా దొంగ లాంతర్ల దొంతర్లు తోరణాలుగట్టి, ఎత్తుగా పందిరివేసి ఒకవైపు తెరాయుగట్టి ఒకమెట్టు ముందుకు వేశాము. ఈ పునాదిని యథాతథంగా తీసికొని కాలంమారినకొద్దీ, మానవప్రతిభ నూత్నత కోరుతుందిగాన, అది భాగోతమంటే బాగాలేదని నాటకమనే నామకరణం చేసింది. ఈ యుత్సాహం రంగుతెరలు దెచ్చి నాట్య రంగాలకు గట్టింది. అంతటితో ఆగలేదు. 'Newness is the sign of life' 'మార్పు జీవలక్షణం' అన్నట్లు రంగం బాగుగా అలంకరిస్తే గాని ఆకర్షణీయంగా యుండదని సీనింగ్ అరేంజ్‌మెంటు. ( Scening Arrangement ) చేయడం మొదలెట్టారు. అదే, అదే కొన్నాళ్లకు నాటకమనే నామధేయం పాము కుబుసంలాగు విడిచిపెట్టేసి 'Drama' డ్రామాయనే ఆంగ్లనామకరణం చేశారు. రంగాన్ని (Stage) అని సామాన్య జనంకూడా పిలువడం మొదలెట్టారు. ఇది కేవలం రంగస్థలగాథ.

ఇక కథాక్రమంలోనికి దిగుదాము. కంచుకాగడాల నాడు తెరవెనుక గంతులువేసే తోలుబొమ్మల (Movements) అభినయాలకు సరిపోయేటట్లు.

'ఔదుగో! రాభణాసురయ్యా లంఘాపుర సముద్రం దగ్గరకు వచ్చారు. అంజనీబాబయ్య గెంతేసి సంద్రాలన్నీ గుభాలున దాటాడు అని వచ్చీరాని అవిస్పష్టమైన ఆంధ్రంలో వచ్చి బూతులన్నీ బద్దలుగొట్టి తెలిసీ తెలియని ప్రజలలో యేదో

నూత్నోత్సాహం కలిగించేవాడు కథకుడు. మనలను మనం సత్కరించుకోనద ఎందుకు? అది యట్లుంచండి. ద్వితీయ దశ భాగోతం. దీనిలోకూడ రంగంమీదకు రంకెలమీద వచ్చిన నటకుడు, నిర్వేషధారుల్లో యొకడైన యే వంతపాట కుడో, ప్రేక్షకులకు (Introduce) ప్రతిపాదనలు చేయాలి. తరువాత గ్రామపెద్ద మొదలుకొని మోతాదులవరకు గల వారి అందరిరాక కనుక్కోవడం, రాజపాత్రధారి విధి. సరే, యిలాంటి లోపాలు లక్షోపలక్షలున్నాయి. హాస్యంలో అందముండేది గాదు. పెళుసు, గాలికాలని యప్పుడంలాగు 'Speeches' వచనములు ఎంత కష్టపడి అప్పజెప్పినా రంగస్థలం మీదకు వచ్చేసరికి తమ స్వంతకవిత్వం తప్పేదికాదు. ధోరణి కూడా బొమ్మలాటధోరణే మార్పు అటే కనుపించదు. ఇక తృతీయదశలో యీ కళాదేవి నాటకమను పేరు ధరించి, పమిట చెరుగుకప్పుకొని కాస్త ఘోషా, గుట్టాముట్టూ తెలిసికొన్నది. ఇదివరకు మాదిరి బట్టబయలు కాదు. తెర యెత్తిందాకా ప్రేక్షకులకు, నటకులకు చూపు లుండేవి గావు. దీనిమీద (Development) అభివృద్ధి నాల్గవదశ- 'Dramatic stage' డ్రామారంగము. ఈ యవస్థలో కళాదేవి చెరుగులు సవరించుకొనడం, హారతులివ్వడం మొదలెట్టింది. ఒక్క వేషధారులు తప్ప మరోకరు రంగంమీద కనుపించేవారు కారు. గుంభన మధికమయింది. స్టేజీ అలంకరణ మధికతరమయింది. వచనము, సంభాషణగా మారింది. కవివాక్యాలు క్రమంగా మృదువైన

పదాలుకూర్చి, ఉచ్చారణ సులభానికై తేనేమి, అవిద్యావం
తులగు ప్రేక్షకుల కవగాహన మగుటకై తేనేమి, గ్రంథాల
వ్రాసేవారు. వాటిని జీర్ణంచేసుకొని యీ చిలకలన్నీ కిలకిల
లాడేవి, దానితోపాటు ప్రేక్షకులు పకపక లాడేవారు. నట
కులు కళారాధకులైతే 'Audience' ప్రేక్షకుల్లో తమ భావ
ప్రదేశాలను ప్రతిబింబింప జేసేవారు. దానిపేర క్రియనియంటారు

నటకుల నర్తనాలైతేనేమి ? భావప్రదర్శనమైతేనేమి !
ప్రేక్షకులలో ప్రతిధ్వనించి వారి హృదయవీణాతంతులను కది
లించడమే రక్తి. ఎరిస్టాటిల్ (Aristatle) అను పాశ్చాత్య అను
భవేత్త చెప్పినట్లు స్నానం భౌతిక దేహాన్ని మాలిన్యరహితంచేసి
నట్లు సంగీత మానసిక మాలిన్యమైన 'Passion' భావోద్రేక
ఆను (Pur[illegible]) [illegible] కీర్తి చేస్తుంది. నాట్యకళవల్ల కల్గే
యుక్త [illegible] లాభాలలో మానసిక మాలిన్య రాహిత్యమొకటి.
ప్రస్తుతం [illegible] ప్రయోజనాలు [illegible] లాభంకాదు [illegible]
[illegible]. సంగీత నాటకాలు [illegible] నిర్దిష్టమైన ఈ వ్యాపార
యుగంలో [illegible] గాను కూడా [illegible] ధరలకు విక్రయం
చేయ బడుతూంది. [illegible] (Degeneration) హీనదశగాని
'Progress' అభ్యుదయంగాదు నాగరికతకు. సంగీతవిద్య
పూర్వం గౌరవం తెచ్చేది డబ్బుతోపాటు. అది, ఇప్పుడో
కేవలం నాణెములను మాత్రమే ముద్రిస్తోంది. అయితే ధనా
ర్జన అవసరము లేదనికాదు నామనవి. కాని సంగీతానికున్న

గౌరవపీఠం దానికుండి, ఆ గౌరవం ధనాన్ని యుపార్జించాలి. అది యుత్తమోత్తము పద్ధతి.

రంగం(Stage) కృత్రిమములకు (Artificialities) ఆశ్రయం. నూతన్నరంగాలు చాలా చిత్రంగా తయారుచేయబడుచున్నాయి కర్టెన్లు కెరటాలలో. క్షణంలో రాజభవనం అట్టలతో తయారవుతుంది ఏ రాజకుమారో విరహవేదన నుమ్మరించడానికి. తెర తీసేసరికి వసంతవృక్షాలు గాలికి యూగుతూ కనబడుతాయి ఏ గొల్లభామో కూనరాగాలు తీస్తూ పరుగులెత్తుతుంది వాని క్రిందుగా. ఎలాంటి కష్టసాధ్యములైన ప్రదర్శనాలైనా (Modern Actors) యీనాటినటకులు గోరుతో గిల్లేసి నాట్యరంగాన్ని గారడీస్థలంగానో, లేక విప్రవినోదుల సంచీగానో మరి అవసరమైతే వేశ్యావసతి పడకగదిగానో, క్షమించండి, మార్చుచున్నారు. ఇదంతా రంగస్థలానికివన్నె తెచ్చుటకే ? ఇక పాటలూ, పద్యాల సంగతి యోచిద్దాం.

తెరమీద బొమ్మలకు తుమ్మముళ్లే ప్రాణమైననాడు పాటలే పద్యాలు, పద్యాలే పాటలు. వచ్చిరాని అమరశ్లోకాలు 'ఇత్యమరః' అనేవాడుక పదంతో కూడా వారి సాహిత్యానికి వన్నె దెచ్చేవి. భాగోతాలుకూడా పాటా, పద్యాలకట్టే భేదం కలుగనిచ్చేవిగావు. ఇక రాగాలంటారా ? ఎరుగరూ ? తను పాడింది రాగం, తా నాడేది నాట్యం. తా మునిగింది గంగ, తావలచింది రంభ. ఇదీ వరుస. భాగోతానికి నాయకురాలి నృత్యం (Dance) చాలా రమ్యత కూర్చేది ఆ రోజుల్లో.

రంగం మార్చడం, నటకులు రావడం, పోవడం ప్రేక్షకుల కళ్లల్లోనే జరిగేవి. తమపరి వచ్చిన నాటకరంగం మీాద స్త్రీ పాత్రధారి కొంచెం సిగ్గు, భిడియం కొనుక్కోవలసి యుండేది. అంతటితో చాలేదిగాదు. అభినయాని కనువైన సన్నని కంఠం యుండాలి. మిగతా పాత్రలు కూడా కొంచెం పాతఫక్కీలు వదలి నూతన్నత కనబరచడం రంగానికి శృంగార మిచ్చింది. వీరి పాటలు, పద్యాలు ఒకటిగాదు. పద్యాలకు తోకలు తగిలించి భావానికి తగ్గరాగాలు కలిపి భాగోతాలను పడగొట్టేశారు. వీరి పాటలు వీధిభాగోతులశైలి (Style) లో గాక రిఫైండు (Refind) గా నడచి వాయిద్యాలతా నాన్ని అనుకరించేవి. సరే యిక (Drama) సంగతి తీసుకుందాం ఇది చాలానాగరికతా పద్ధతులతో (Improved methods)లో నడుస్తూంది. పద్యాలు భావానుగుణ్యమైన దుసులు ధరించు తాయి. పాటలు తబలాలతోబాటు జలపాతంలాగు క్రమస్వరా లతో నడుస్తాయి. నటకులునూన్న చక్కగా (Make up) పాత్ర ధారణమొనర్చి ఫింఛాలు విప్పి మేఘావృతగగనం నీడలో బర్హి నాట్యాలలాగా కళారాధన చేసేవారు. ఇదియే ప్రస్తుతం యింకా (Improved methods) వృద్ధి సూత్రాలతో అమ లులో నున్న నాట్యవిధానం.

అయితే యిప్పటి (Development) అభివృద్ధిలో చాలవరకు వెండితెర తెచ్చిన మార్పేమిటంటే స్త్రీలు స్త్రీ పాత్ర ధరించాలి. అంతేగాని పురుషుడు స్త్రీకాగూడదు. పురు

షుతు స్త్రీత్వాన్నారోపించుకొని తెరమీద చీరగట్టుకొని కుల్కు-
డమేమంత స్వారస్యం గాదనే బోధ. ఇది నాట్యరంగాలలోనికి
నారీరత్నాలకు తలదూర్చే సందిచ్చింది. అది మొదలు స్త్రీలు
స్టేజీలపై నైనా పాపం స్వాతంత్ర్యవాయువులు పీలుస్తూ, రంభ
లుగానూ, రాణులుగాను, ఝాన్సీలుగాను, చంద్రమతులు
గాను, యింకా అనేకంగా నిమిషనిమిషానికీ మారే వ్యాష
న్నుకు జవాబు చెబుతూ కులిప్పి నృత్యాలొనర్చి, నగ్న
నృత్యాలు కావనుకోండి! ప్రేక్షకులను (Audience) పై మరుచ
చేస్తున్నారు.

మానవత్వము నేక మార్పులకు లోనౌతుంది. అలాగే
యీ రంగస్థలానికికూడా మానవసమావాసంచే యీ మార్పులు
తప్పినవిగావు. అయితే గాజులపై మోజుచేత తన సుకుమార
మైనచేతులు నలుపుచునా ఓర్చుకొన్నే కాంతెలాగు యీ
రంగస్థలంకూడా యీ శ్రమలన్నీ తనబాగుకొరకేయని ఓర్చు
కొన్నది. దానిప్రతిఫలమే యీ వెండితెర!

(Improved) అభివృద్ధి పద్ధతులమీద నడచుచున్న
(Drama) డ్రామాస్టేజీని అధిగమించినదీ వెండితెర. దీని జీవిత
చరిత్ర అనేక గ్రంధాలను క్రమింగగలది. అనేక సంపుటముల
నాస్వాదించగలది. (Scientific Progress) రసాయనశాస్త్రాభి
వృద్ధియే దీనిజీవాంకురం. (Invention) యిన్వెన్షనే దీని
యింప్రువ్‌మెంటు (Improvement). మబ్బుతెరలు తొలిగి స్తే
కనబడే చంద్రునిలాగు శాస్త్రజ్ఞులు, పరిశోధకులు అజ్ఞాన జలద

పటలాలు పటాపంచలుచేయుటచే ప్రకృతి రహస్యాలెన్నో వాటంతటవి బయటపడుతున్నాయి అనుదినం. ఇదియే మన వెండితెరను బంగారుతెరగా మార్చుశక్తి.

( Man is in quest of new things ) మానవుడు నవ్యతా పిపాసి. ఎండమావులలో నీరు త్రాగుదామని యత్నిస్తాడు. ఇసుకనుండి తైలము పిండుదామని తలపోస్తాడు. గగనకుసుమాలు తన ప్రియురాలి తలలోనలంకరిద్దామని యాసపడుతాడు. ఇది వెర్రియూహాయని కొందరి యుహోహ. మానవునిలోనుండే యీతలంపే ఆతనినిముందుకు తీసుకొనిపోగల్గుతుంది. జడపదార్థంవలె మానసికతత్వం ముక్కు మూసుక తపస్సుచేసేదిగాదు. అందులో పారడే( Faraday)వంటి మహావిజ్ఞానులుతమవిజ్ఞానాన్ని మూటగట్టుకొని పరలోకాలకు ప్రయాణముగాక అధికశ్రమల కోర్చి చీకటనక, కష్టమనక కాంతికొరకై పాటుబడి ఎలక్ట్రిసిటీని పుట్టించారు. వాల్టాయిల్ ( Voltoil ) ప్రథమ ఎలక్ట్రీషియన్ ఈతడే పరికృతి గర్భమునుచీల్చి మెరపు తీగలాంటి కాంతిని బయటకులాగి ప్రజలకు దారిచూపాడు. దానికితోడు యితర శాస్త్రవేత్తలు ఛాయాగ్రహణం ( Photography ) కనిపెట్టారు. ( Sanfransisco ) శాన్‌ఫ్రాసిస్‌కో ప్రాంతాలలో దొరికే సెల్యులాయిడ్ ఫిలిం దిగుమతిచేసి తారలను అమాంతంగా ఆ ఫిలుములలో ఇక్కించి చలిచప్పుడు లేకుండా కర్టెన్‌లపై కసబరచేవారు. అదే మూగఫిలిం.

ఆకాలములలో శబ్దగ్రహణం ( Audiography ) అమలులోకి రానిరోజులలో యీ ( Silent Pictures ) మూగచిత్రాలే ప్రజలనాకర్షించేవి. కమ్మనిగాత్రాలను కట్టివేసికొని చేతులు తిప్పేనటకుల కళనివురుగప్పిన నిప్పుగాకమరేముంది? వెండితెరపై కెక్కామనే సంతోషమొక్కటే మిగిలేది నటకులకు. కంచుకంఠాలు తుప్పువదలేటట్లు పాడదామంటే నోరు లేదుగదా! పాపం, ఆనాటి కళారాధకునకు. ఆకసంపైని తారలవలె యీ తారలు రంగుపోకడలతో తెరపైని గంతులేసి నర్తనములొనర్చి మనవెండితెరకొక క్రొత్తవెలుగుతెచ్చారు. కథ యెంతరసవంతమైనా ప్రేక్షకుడెంత సూక్ష్మబుద్ధియైనా తెరమీాద చేతులు తిప్పే యీ మూగనీడల ఆటలకేమని అర్థంచెప్పగలడు? నిజానికి కేవలం తన ( Movements ) అభినయంవల్లనే భావప్రచారం చేయడానికి నటకుని కెంత నేర్పు, చాకచక్యత, కావాలో యోచించండి. అనువాదం (Translation of movements) రసాభాసుకేగాని యీ మూగసినిమా కాటేవన్నితెచ్చేదికాదు. వెండితెర యీ దశలో ప్రారంభమై కొద్దిరోజులలోనే తన మౌనవ్రతాన్ని వదిలేశింది. ఆడియోగ్రఫీ ( శబ్దగ్రహణం ) వెండితెరకు జాబిల్లులు వేసింది. సంగీత సాహిత్యాలురెండూ శృతిరాగాలలాగు తెరమీాద ప్రాకులాడడం మొదలెట్టాయి. యక్షిణీదీపం (Magic lantern ) నుండిమూగసినిమా యుత్పత్తి చేయబడింది. తారాకోకిలలు రసాలవృక్షాగ్రాలనెక్కి కమ్మగా కూయుడం మొదలెట్టాయి. కవులకలాలు సిరాలోముంచవలసి

వచ్చింది. 'స్పీచెస్, డయిలాగ్సు' ప్రేక్షకులకు సంతోషం కలిగించేలా తయారుచేసే బాధ్యత ఒకటి వచ్చిపడింది కవులకలాలపై. ఇక పాటలకేం లెండి. ఏపిచ్చిముక్క పాడినా మనకోకిలలు అమృత వర్షం కురిపిస్తున్నట్లుగానే యుంటుంది. ముఖ్యంగా మనతారామణులు వారికంఠాలలో యేరసధారాస్రవంతి యిమిడున్నదో గాని తమగానంతో ప్రేక్షకులకు మంత్రకట్టుకట్టగలరు. 'రహిపుట్ట జంత్రగాత్రముల రాల్గరగించు' మన ముదితల కసాధ్యమైన పని యున్నదా? ఇక వారిరూపం సాక్షాత్ రంభాస్వరూపమే.

ఈ మాదిరిగా వెండితెర కళామందిరమై, పాటలకేమి? పద్యాలకేమి? నాట్యానికేమి? నర్తనానికేమి? డైలాగుకేమి? డాంబికానికేమి? పెట్టినపేరనిపిచ్చుకొంది. తారలకు తగిన తర్ఫీయు దివ్వడంచేత ఫిలింకాస్తోకూస్తో రసవంతముగానే యుండేది ఆనాటిప్రజలకు. ఇప్పుడైతే ఆనాటిఫిలుములు ఏస్థానానికర్హాలో మీరేయోచించండి.

ఇక కవిబ్రహ్మ యూహాప్రపంచంలో చొరవపడదాము వేలకొలది నాటకాలు ప్రచారంలోయున్నాయప్పటికే. అయినా ఫిలుండీయాలంటే సరియైన కథతగినరూపంలో లభ్యపడడం కష్టతమంగాయుండేది. వెండితెరపై యీపేజీలన్నీ అతికించాలంటే దుస్సాధ్యం ( Impossible ). కాబట్టి యే రెండువందల పేజీల ( Essence ) సారము పిండి భావానుగుణ్యముకు భాషా వస్త్రాలు కట్టి తెరమీదకు తీసుకరావలిసి యుండేది.

ఈ నాటికవికి ఫిలిం వాతావరణముత్సాహకరంగా కను పించడంలేదు. కేవలంఫిలింకవులు దర్శకునిచేతిలోనికీలుబొమ్మలు (Sit) అంటే కూర్చోవాలి. (Stand) అంటే నిలుచోనాలి. అంతవరకే వారిస్వాతంత్ర్యం. దర్శకుని తల తన బుర్రలోపెట్టు కొని సంభాషణలల్లాలి. ఆ సంభాషణలు దర్శకుని అభిరుచికి ఆయనగారి విషమపరీక్షలకు తట్టుకోవాలి. 'అదిగో! ఆపదమంత స్వారస్యంగాలేదు యీ పదంవాడు దామా?' అనిదర్శకుడన్నా డంటే కవిబ్రహ్మ తనమూడు తలలు ఒక్కసారివంచి 'చిత్తం! అలాగే నేనూ, అనుమానిస్తూనే యీ పడికట్టురాయివడేశాను!' అని అనాలివెంటనే. అవసరమైతే కవి నామమాత్రావశిష్టుడై మంచి చెవులకు మాత్రంబాధ్యుడై దర్శకుని కలంగీతలే దిద్దాలి. పాటల విషయం దర్శకుడొసగినప్లాను మాటలుమాత్రంమార్చి వ్రేసుదీయాలి కవిగారు. పదాలుమాత్రం సరళంగానూ, చౌక గానూ, సరసంగానూ, సాత్వికంగానూ యుండాలి. ఇన్నికట్టు బాట్లతోయున్న కవిగారికలం 'బాలగసాలసాల నవపల్లవకోమల కావ్యాలు' ఏమల్ల కల్గుతుంది?

మనఫిల్ముల్లలో నూటికి తొంభై (Ninety percent) రామాయణ మహాభారతాది ఎపిక్సులోనుండి కత్తిరించినకథలే. ఈ చిత్రగాథలు తెరమీదకు వచ్చేసరికియే (Aredight) విద్యుచ్ఛాప ప్రభావమో మరిదేని పరితాపమోగాని ఫిలిము లోవిధమైన కళగలిగేది. ఈకళ కళంకరహితంగాదులెండి. లోటు పాట్లులేనిచిత్రోత్పత్తి యింతవరకవడంలేదంటే చాలావిచార

కరమైనవార్త. కళంక రాహిత్యం గావాలంటే ఆదర్శచిత్రాలు
యుత్పత్తికావాలి. అదిమాటలతో పనికాదు. లక్షలవర్షంలో
యుంది. ఆవర్షానికిగాని యీపంట పడదు. యీ పంటసరిగా
తప్పాతాలూలేకుండా, గడ్డ, మానుగాయ రాకుండాయుంటే
గాని కొనేవా రధికతరలు పెట్టరు. అది దీనిరహస్యం. హిందీ
ఫిలుములసంగతి చూడండి. వానిలోకొన్ని చాలావరకు ఆదర్శ
ప్రాయంగా నున్నాయని మనదర్శకులతో సహా నాలికలు కొరక
డానికిగలకారణం ఒక్కసారాలోచించండి. తెలుగుతారలకు
హిందీతారలకు గల్గినభేదమేముంది? తెలుగుతారలే హిందీనటీ
మణులుగాను, నటకులుగానుయున్న ఫిల్ములు యెన్నిలేవు ?
మరి యీ తెలుగు, హిందీచిత్రాలకు దేనిలోయుందీభేదం ?
ఇదంతా పిండిలోయుంది. పిండికొద్దీరొట్టె. రొట్టెకొద్దీ రాబడి.
ఇదీ దానివరుస. ( Gradation ). మరియొక విషయమాలో
చిద్దాం. ఐక్యతకార్యసాధనకు తగిన సాధనం ఈ సాధనసంపత్తి
లేంది ఎకార్యమైనా, సానుకూలమవడం దుర్లభం. హిందీ
డైరెక్టర్లలోయున్న ఐక్యతైనాకనుపించదు, క్షమించండి, మన
ఆంధ్ర దర్శకులలో. '( Too Many cooks Spoil the Broth)'
పదిమందిచేయుపనిపాడే, అన్నట్లు బహుదర్శకత్వము భ్రష్ట
మునకే. ఇది మనవారిలో అధికంగా కనపడుతుంది. మూడవది
స్వార్థపరత్వం. కేవలం కళాదేవికి పూజలుచేద్దామని యను
కొనకయే తారామణి ( Actress ) పసిడిశరీరానికో దాసుడై ,
యీనాటకానికి నాందివేయడంవల్లనూ, తన కోర్కెలు దీర్చ

కొనడానికై యీ తీగెకల్లు పెట్టడంవల్లనూ, కలిగే కుక్కమూతి పిందెలు మన ఫిలుముల దారిద్ర్యాన్ని పోగొట్టవు. వానినిచూచి ఆంగ్లదర్శకులుకూడా పక్కనవవ్వుతారు. ఏభాషలో నున్నా ఫిలిం రక్తి కట్టడం ప్రాధాన్యం. తెలుగు చిత్రాలమాట యటుంచండి.

తమిళఫిలుముల విషయం తీసుకుంటే వాని జీవితం కూడా హాస్యాస్పదంగా తోస్తుంది. పాపమా చిత్రకారులు యెంత నేర్పు మాటగట్టినా, ముందుచూపేగాని వెనుకచూపు లేదు. నిజాని కాచిత్రాలు ప్రేక్షకుని ఓర్పును పరీక్షచేస్తాయి. నాలుగుగంటలకు తక్కువలో ముగిసే తమిళఫిలిం మృగ్యమన డంలో ఆక్షే అతిశయోక్తి లేదు. 'మే మింతకాలం యీ చీకటిగదిలో కూర్చొనలేము. యీ విషవాయువులు పీల్చ లేము. మమ్మ కనీసం మూడుగంటల్లో వదిలేయండి! అని రసికవర్గం ఎన్ని పిటీషనులు పెట్టినా ఆ తమిళదర్శకులకు చెవి కెక్కినట్లు కనబడడం లేదు. ఫిలింబోరింగ్‌గా యుంటే ప్రేక్షకున కమృతాంజన మవసరంగాదా? మరి? ఫిలిం కుదించి మూడుగంటల్లో ముగించాలని వారెంత ప్రయత్నించినా విఫల మవడానికి అనావశ్యకమైన విషయాలు తెరపై కనుబరచడమే కారణం. ఉదాహరణకు ఏ ఫిలుములోనో ఒక వ్యక్తి రైలు ప్రయాణం చేయవలసియుంటే తమిళ చిత్రాల్లో ఆ వ్యక్తి టిక్కెట్టు తీసుకొనడం మొదలు తిరిగి యివ్వడం వరకు 'తూ చ' వదలకుండా కనబరుసారు. దానికి తోడు మరియొక లోపం

పాట లసం ఖ్యాగం. తుదకు రైలు ప్రయాణంలోకూడా నట కుడు నోరు మూయడానికి సావకాశంలేదు. యీ చిత్రాలు తమిళ ప్రేక్షకుల నెంత తలలూప చేసినా, తక్కిన వారికి తల నొప్పికి కారణమవడం నిజం. యీ రెండు లోపాలు తమిళ చిత్రాలనుండి వదలిపోతే ప్రజాహృదయాలు యీ చిత్రాలను ముద్దుపెట్టుకొనకపోవు.

తేనెతుట్టె లాంటి మన ఫిల్ముల లో లోటుపాట్లనే పురుగులు వేరేసి మధువును మాత్రం ప్రేక్షకుల కనులముందు పెట్టి నోరూర చేయడంలో యుంది రక్తి. ప్రేక్షకులకు తా మీ లోకంనుండి యెగిసిపోయి యే స్వర్గధామంలోనో విహరిస్తున్నా మనే భావం కల్గించడమే రక్తి. శృంగారరసం చూపించడంలో ప్రేక్షకుడు యే రంభాబాహుబంధంలోనో మైమరవాలి. దుఃఖ రస ప్రదర్శనం ప్రేక్షకుని కనులపై, చంద్రుడు చంద్రమణిసిలపై గల ప్రభావంకల్గి యుండాలి. ఇక వీరరసమా ? మృత్యువును మరపించాలి. హాస్యరసప్రదర్శనం నేర్పుతో కూడియుంది. (Circus) సర్కస్‌లో హాస్యగానికి (Baffoon) ఎంత నేర్పు (Skill in art) యుండాలో వెండితెర మీద వెన్నెల గిలిగింత లకు అంత చాకచక్యత (Dexterity) కావాలి. యీ రసా లలో యేది తక్కువైనా, రసాలాగ్రమునుండి కూసే కోకిలల మధురగీతాలు వృధాశ్రమ యవుతాయన్నమాట మరువకండి. అది అలాయుంచి, ప్రస్తుతం ఫిలిం దర్శకుల బాధ్యత లధిక మైనాయి.

'ఫిలిం' దీయాలంటే రకరకాలరుచులు కలిపి అనువైన పాకంలో వండాలి, చూడండి! ఛాయాగ్రహణం(Photography) ఎంత బాగాయున్నా 'చిత్రం' ఆడిబుల్‌గా లేకపోతే ఉప్పులేక పప్పులాగుంటుంది రసికుడు పెదవివిరచి బయటకువస్తాడు. లేని శబ్దగ్రహణం (Audiography) ఎంత ఛాయాగ్రహణం (Photo graphy) భ్రష్టు అయితే 'వెధవఫిలింని ఒక్క నిప్పుపుల్లకు బలి యీరాదా? ప్రేక్షకుల కళ్లు పోగొట్టడానికి బదులు' అని ప్రేక్షకులు పుటక్కున అంటారు. యీ రెండూ (tolerable) సహించ దగియున్న సంభాషణ (dialogues) చప్పగా యున్నయ్యంటే కవి బ్రహ్మకు ప్రహారణాలు తప్పనిసరిగా అందుతాయి. పోనీ అవీ బాగున్నాయనుకుంటే ఏనటుడైనా అను నాశికలో అవి స్పష్ట (Indistinet) భాషో మాట్లాడారంటే ఫిలింలో కొంచెం వంకర యుందనక మానరు ప్రేక్షకులు. ఇవన్నీ జతబడినా నిర్దాక్షిణ్యంగా కొందరు ప్రేక్షకులు — (Surgerycourse) శస్త్ర చికిత్సానిపుణులైన ఆపాతగిరులలాగు (Like Dcctors) సర్వాంగపరీక్ష చేసి వార్తాపత్రికల కందచేస్తారు తారామణుల బాగోగులను. ఇదికూడా ఫిలింకరోస్నికి ఆయిల్‌మార్క్. పైగా వెండితెర నటీమణుల చేతుల్లోని గాలిపటమైన యీ రోజుల్లో, వారి సౌందర్యమే ఫిలిం అందముగా పరిగణిస్తారు కొందరుపెద్దలు. ఇవన్నీ తగిన పాళ్లల్లో సమకూడినా, (Archestra) వాద్యగోష్టి యనే రజనుతేంది ఫ్రూలురాల వీ ఫిలింముత్యాల పగలొత్తిలో. ఈ నవయుగంలో ఆర్కెష్ట్రా కెంతైనా విలువుంది. కాదండీ

మరి, నిర్జలగంధకి కామ్లము ( Concentrated sulpuric acid ) తగిలినంతమాత్రాన సాత్వికత(Passivity)పొందేటటువంటిన్నీ తడిగాలిలో తుప్పు (Rest) పట్టేటటువంటిన్నీ వెధవ యినుప తీగలు కొయ్యచట్రముల పై బిగించి గాంధర్వగానం పలికిస్తు న్నాడంటే మానవు డే స్థానాని కర్హుడో యాలోచించండి నిజంగా దిల్‌రుబా గాని, జలతరంగిణిగానీ, హార్మోనియంగానీ, ఫిడేలుగాని, వీణగాని, ఫ్లూటుగాని యింకా చాలాయున్నాయి ఆర్కెస్ట్రాలోని భాగాలు ఎంతచక్కని శబ్దాన్నుత్పత్తి చేస్తాయి. తబల, మృదంగం మొదలయిన వాని సొగసు ఫిలిం దేవతి కవన రమే. యీ వాద్యగోష్ఠిలోని కొన్ని తీగలు మ్రోగేటపుడు ప్రేక్షకుని హృదయతంతులుకూడా కలసి మ్రోగుతాయి. అప్పుడే ప్రేక్షకుడు ధన్యుడు. 'Pitch'స్థాయినిబట్టీ (Frequency) స్పందనాన్ని బట్టీ వాయిద్యాలకు తారలకు గళంమారుతుంది. ఈమార్పులు ప్రేక్షకులకు వ్యంజనాలలోని మార్పులలాగు వివిధ రుచు లూరిస్తాయి. దర్శకుడు గమనించవలసిన విషయాలు చాలాయున్నాయి.

పై వాటన్నిటికంటె ముఖ్యం సీన్సు. జపాను మేడ లైతే నేమి? న్యూయార్కు కట్టడా లైతే నేమి? అగ్రహారవు అల్లిక లైతేనేమి? ప్రకృతిచిత్రా లైతేనేమి,పాత్రౌచిత్యానికి,భావానికి తగ్గట్టు తెరపై కనబరచడంలో ఉంది పిలింకన్య సోకంతా. ఇదొక విధమైన (Artistic finishing touch) కళాపరిపూర్ణత్వ మంటే అతిశయో క్తి కాదు.

వీటికితోడు నాట్యం (Dance) కూడా అవసరమైన యుపాంగం. సాధ్యమైనంతలో వీలుగల్పించియైన ఫిలుములో నాట్యంయిరికిస్తాడు నిర్మాత. కారణంసుగోచరం. ఫిలింకన్యసౌందర్య భంగకరమైన లోపాలు పూడటానికి ఈ గజ్జెలమోత, యీ చేతి త్రిప్పుడు అవసరమే. అయితే ఒక్కమాట ... యీ ప్రకృతి విరుద్ధమైన పాశ్చాత్యాభినయం మన వెండితెరకు గౌరవహాని తెస్తుంది. ఈవట్రువు సుడినాట్యం, యీబృహన్నల నృత్యం ఎవరికవసరమో వారికేగాని చిత్రకళతో సమానమై, భారత కళలలో పేరెన్నికగన్న భరతనాట్యాన్ని చూచిన కళ్లకవి అర్థ శూన్యంగాక మరేమి? ప్రాచీన భారతీయుల కుగ్గుబాలతో నేర్పబడ్డ గంధర్వవిద్య, దేహస్వాస్థ్యారోగ్య సౌందర్యములు గూర్చు వ్యాయామ విద్యయగు మన భరతనాట్యము వదలి విదేశానుకరణ మనకెందుకు? అభినయ నాట్యాలు శృతిరాగాల వంటివి. మానసిక భావాన్ని మృదువుగ వ్యక్తము చేయుట కుద్దేశింపబడినది అభినయశాస్త్రము. కరచరణాద్యవయవముల చేతను, గానముచేతను విభావమును వ్యక్తపరచునది నాట్య శాస్త్రము. కళాప్రీతిమయగు ముదిత తన భావాన్ని కళాభి యుక్తంగా వ్యక్తీకరించుటకు, వ్యాయామక్రీడకు కూడ యీ నాట్యశాస్త్రముద్దేశింపబడ్డది. నృత్య నృత్త నాట్యములను మూడుపభాగములు కలిగినది నాట్యశాస్త్రము. తాళ లయాను గుణ్యమైన సభావయుతమైనది నృత్యము. రసభావ రహితమై

తాళ లయానుగుణ్యమైనది నృత్తము. కథానుగుణ్యమైనది నాట్యము. ఈ నృత్య నృత్తనాట్యాలు, లాస్యము తాండవమని రెండు భాగములు. ఇంత శాస్త్రబద్ధము, రసాభిరామము అయిన మన భరతనాట్యం వదలి చౌకరకపు యితర నృత్యాలు మన ఫిలుములలో అతికించడంకంటె వేరే నీచమేముంది. భారత గౌరవానికి దోహదమైన చిత్రకళానుబంధమైన భరతనాట్యం మన వెండితెరకు బంగారుపూత వేయాలి. మన ప్రేక్షక సమాజం నిజమైన తన్మయతలో కిలకిలమనాలి. హృదయంలో నవరసాలు యుత్తుంగ తరంగాలై ప్రవహించాలి.

కొన్ని కొన్ని ఫిలిములలో, ఫిలిముల పేర్లు చెప్పనవసర ప్రసంగమేమో చారిత్రాత్మకమైన (Scenes) దృశ్యములు తెరపై నడిపించి ప్రేక్షకులను అనేక శతాబ్దాల వెనుకకు లాగుతాడు దర్శకుడు. మరికొన్ని ఫిలిములలో ఆంధ్ర శిల్పి చెక్కిన చలువరాళ్ల విగ్రహాలను ప్రేక్షకుల కనుల ముందు పెడతాడు పూజించమని. ఇంకా కొన్ని సమయాలలో ప్రకృతి గర్భములో దాగియున్న చిత్రవిచిత్రాలు వెలికందిస్తాడు డైరెక్టరు. H. G.Wells గారి (Time Machine) 'కాలయంత్రం'లాగు కొన్ని శతాబ్దాలు ముందుకు, వెనుకకు కూడా లాగగలశక్తియుంది దర్శకునకు.

ప్రేక్షకులున్నూ యిలాంటి దృశ్యాలు తమ దృక్పథానికి తగిలినపుడు మాలిన్యరహిత మానసులు గాకపోరు. నిజంగా యీ దృశ్యాలు యే మానసోద్యానాన్ని పుష్పింపజేయవు?

ఏమానవుని హృదయసరస్సును పున్నమనాటి సముద్రం చేయదు? ఏమానవుని నేత్రవిమానాలకు హార్షంగళ్గించదు. ఇదీ వెండితెర చేసే మానవసేవ. 'మానవసేవే హరిసేవారా' యని కూనరాగాలు తీసే వెండితెర మన కాదర్శప్రాయి.

ఇన్ని అలంకారాలతో, శృంగారాలతో ఫిలింతయారు చేసిన దర్శకునకు చెమట యారిపోకముందే వార్తాపత్రికల పొగడ్తలో ( Compliments ) తేకగూటింపులో అందుతాయి. దానితో కొండెక్కడమో లేక దీపం కొండెక్కడమో అవుతుంది పాపమా పేదదర్శకుని పని. బుక్ చేసుకొనేటప్పుడు తారారత్నముల చేతుల్లో ఆయనపడ్డ బాధలు, స్టూడియోలో నటకులతో తానుబడ్డ శ్రమ, 'సెట్టింగ్సు'కు ఆయన కార్చిన చెమట, ఫిలిం విజయవంతముగా యుండాలని తాను కురిపించిన కుబేర వర్షం, దాని (Advertisement) ప్రకటన నిమిత్తం తాను పన్నిన పన్నుగడలు, అన్నీ ఆయన కళ్లల్లో రీలు తిరిగినట్లు కనబడుతాయి. వానితోబాటు వార్తాపత్రికల వ్రాతలు కూడా ( unfavourable ) అనుత్సాహకరంగా యున్నాయంటే పాపం, దర్శకుడు నిర్వీర్యుడౌతాడు తన తెరమీద చూపిన పాలరాతి విగ్రహంలాగు. ఇక దర్శకుని పుణ్యం పండి పంటబాగా పండిందాంటే ఆయనగారు గాలిపటంలాగు గగనవీధుల్లో సంచారం చేస్తాడు. ఇది దర్శకుని సామాన్యగాథ. దర్శకులలో కూడా,

చూడండి, (Men Of different Mentalities) అనేక మానసిక తత్వాలు కల్గిన వారున్నారు.

కొందరుఫిలిం (Artistic) కళాయుక్తంగా లేకపోయినా ఏహాస్యరసంలోనో ముంచి ప్రేక్షకుల పర్సులబరువును తగ్గించ డంలో కృతకృత్యులౌతారు. నిజానికిదీయొక నేర్పసుమండీ? మరికొందరు దర్శకులు, వారికీ సంగీతానికి సంబంధంలేదేమో! తమఫిలిములలో ఒక్కపాటగాని, ఒక్కపద్యముగాని శృంగా రానికి నచూపించరు. దీనికి కారణం సంగీత పాటకులగువటకు లయితే ఎక్కువ కట్నాలు కోరతారని కాదుగదా? మరికొన్ని ఫిలుములున్నాయి. మరియొకరకం 'చిత్రాలు' సాదామతాబాల వలె వడిదుడుకులు లేకుండా సాఫీగాకాలుతాయి. ఇంకా అనేక రకాలున్నాయి, వీటిలో. వాటన్నిటినీ విమర్శించాలంటే కాగి తాలు చాలాకావలసి యుంటాయి.

మానవజీవితాన్ని విప్పి విమర్శి స్తే అతని తత్వం చాలా చిత్రంగాని కనిస్తుంది. మానవుడు తోటిమానవుని జీవితం (Study) పాఠ్యంచేద్దామని కుతూహల పడతాడు. దెవాంశ సంభూతులుగానీండి, కాళీదత్త కవితాశకులుగానీండి, వ్రాసిన కావ్యాలేమి? కథలేమి? విమర్శనపూర్వకంగాతిరగేయండీ, అవి యే మానవుని జీవితాన్నో ప్రతిబింబిస్తుంది. ఏమానవుని చరిత్రనో కాగితవు తెరలపై ప్రదర్శిస్తుంది. ఏవిరహగాధనో, ఏయభాగ్య జీవితాన్నో లేక ఏభక్తుని కథనో మరియే (Tyrant) రాక్షస

నియంతజీవితాన్నే, యింకా యేరసికుని చరిత్రతో మనకు విని
పిస్తుంది. ఇదిమానవ తత్వంలో నిరహాస్యం. అంతదాకా దేనికి ?
మానవసంచారం మృగ్యంగాయుండే కారడవులలో సంచారం
చేసేకొన్ని జాతులవారెవరైనా, దారితప్పిగాని, దర్శనకుతూహ
లంచేగానీ,అచటికివెళ్లితే వారింత గౌరవిస్తారనడానికి వీలులేదు.
యజమాని పొరుగూరినుండి వచ్చినపుడు అతని పెంపుడుకుక్క
( Pet Dog ) చూపే అమాయకప్రేమ, డబ్బుతెచ్చిన విటుని
పెదవులను తనచెక్కిలి నానించే వేశ్య కపటప్రేమ, యేడ్చు
చున్నపిల్లను చంకనుబెట్టుకొని స్తనంపై గుడ్డ తొలగించునపుడు
దైవత్వంగల ఆ అమాయకశిశువు కనపర్చే నిష్కపటప్రేమ
ఆ అడవిజాతి అభిమానాను రాగాలకు సరిజాలవు. దీనికికారణం
మానవునకు తనతోటి మానవునియందుగల అనురాగసంబంధం.

ఏకబ్బంలోనో తోటిమానవజీవితాన్ని చదివి ముసిముసి
నవ్వులునవ్వే యీజీవి వెండితెరనుచూచి యెంత మురిసుకుం
టాడో! తెరమీది జీవితం తన జీవితానుకరణ మానో కాదో
యని తర్కం. తన జీవితాన్నీ తెరమీద ఛాయాజీవితాన్నీ
పోల్చి చూస్తాడు. తనజీవితపథంలో తగిలిన కష్టపరంపరలు
ఆతెరపైని కూడా కనబడుతాయేమోనని వెతకుతాడు పాపం
వేయికళ్ళతో యీ వెఱ్ఱిప్రేక్షకుడు. వెండితెరపై కనబడే విరి
జాజిపూలూ, రేనికరబంధాలలో ప్రాకులాడే ముగ్ధనాయకులూ,
వృక్షాగ్రాలపై కూతలుకూసే కోయిలలనూ చూచి అమాయ

పడతాడు. ఛీ, మానవుడు ఒక్కొక్కప్పుడు ఎంత నీచత్వానికి
పాలుబడతాడు. తెరమీది నీడలుచూచికూడా నాలికగొరకాలీ?
అసూయపడాలీ? ఇక తెరపై నేయభాగ్యజీవితమో? కనిపిస్తూం
దాంటే తనకు తెలియకుండానే కళ్ళవెంబడి నీరు కారుస్తాడు
పాపం! తన జీవితంలోకూడా అపుడపుడు అట్టి యవాంత
రములు చూచినవాడే యగుటచే శ్మశానవైరాగ్యం అభిన
యిస్తాడు. కథ యే పురాణాల్లో (Epics) దోనైతే తనకున్న
సాహిత్యంతో తలయూపుతాడా తెరపైన కనబడుచున్న మహ
త్తరదృశ్యాలతోబాటు. అంతటితో నూరుకోడు, ఏ శ్రీరామ
చంద్రుడో, వెన్నలదొంగయో తెరపైన కనబడ్డాడంటే ఆత్మ
నమస్కార బాణమొకటి విసరుతాడా తెరపైకి ఎంతో భక్తుని
లాగ. ఏ రాక్షసుడో భయంకరంగా కర్టెన్‌పై కనుపించితే
కత్తినినూరుతాడు తానుకూడా దుష్టశిక్షణకే పుట్టిన యవతార
మూర్తినని. ఇక యేసీతారాముల అరణ్యవాసమో వెండితెర
ప్రదర్శించిందంటే 'అయ్యో! సాక్షాత్ వైకుంఠవాసియగు ఆ
శ్రీరామచంద్రునికే తప్పలేదుగదా?' విధి వ్రాలు. భూగర్భ
సంజాత సీతకేని ధాత వ్రాత వాతప్పగాలేదుగదా? అని
ముక్కుపై వ్రేలిడుకొని గొప్ప వేదాంతధోరణి ప్రారంభిస్తాడు
తెరముందే. విషచర్చితకుచములు వ్రేలాడ మాయావేషమున
నందునిగృహమున కరుదెంచిన పూతననుచూచి సర్వాంతర్యామి
యగు దేవకీతనయుడు శివ్యమనియేద్వ ప్రేక్షకుడు మైమరచి
'పాడుపూతన పసిబాలుడను కనికరమైన చూపదే! అయ్యో

విప్రావృత కుచస్పర్శచే ముద్దులు మూటగట్టు ఆపశిగాలుని నాల్కపోడిచూరదే? ఎంతటి ప్రమాదం? అని తన కొడుకు బావిలో పడేవన్నపుడు పరుగెత్తిన శ్రీనాథకవి వలె రిక్తహస్తంతో పరుగులెత్తుతాడు రాకెట్ బాంబు (Racket Bomb) కు కూడా ఎగురుతుంటే పూతనను చంపడానికై, ఇక ప్రేమికా ప్రేమికులు వెండితెర వెనుకనున్న విరజాజి పొదల మాటున దాగి.

> "పంచాతి పూల గోడాటా, పెంచేసి ప్రేమ తీగలలో
> పండారు ప్రేమ వెన్నెలలో, నిండారు ప్రేమ వాహినిలో;
> పొర్లాడుదాము మనమికనూ పొర్లాడుదాము సమ్మికనూ.

అని ప్రేమమేనా తమ మధుర గీతాలు విప్పి విదళిస్తుంటే ప్రేక్షకుని దేహం ఏమవుతుందో ఆతని యూహాతలాంటి పరిణామము మొందుతాయో మీరే యూహించండి.

ఇన్ని భావ పరిణామాలతో, యిన్ని భౌతిక మార్పులతో వెండితెరను విదళించుకొని బయటకే మొగింతతో వస్తాడు? (The end) 'సమాప్తము' తెరమీద చూచేసరికి ప్రేక్షకుని హృదయం ఒక్కసారిగా యీ సినిమా ప్రపంచంలో నుండి మన లోకానికి రానంటే రానంటుంది. తాను కూడా వెండితెరమీద యెక్కి నాట్యం చేద్దామా? అనే యూహాంకురం మొలకెత్తి తెరదాటి వచ్చిందాకా బాధిస్తుంది. కాని యీ విశాల ప్రపంచంలోన అడుగు పెట్టేసరికి ఆతని

యాలోచనలన్నీ పిట్టలవలె యెగిరి పోతాయి ఆకసంలోకి. మరికొంత సేపటికి చూచివచ్చిన ఫిలిం పేరడిగితే నాల్క వెళ్ల బెడతాడు. ఈ మరుపే లేకపోతే మానవునకు మరణంగాక మరేముంది. తన ప్రియమైన జీవిని దుర్మార్గంగా తననుండి దైవమో, దయ్యమో తొలగించినపుడు కళ్లు సముద్రాలు చేసి యేడ్చే జీవి, కొద్ది దినాలలోనే ఆ విషయాన్ని కాల గర్భంపాలు చేస్తాడు. ఇది ప్రేక్షకుని ధోరణి. ఇక నటకులను గూర్చి ముచ్చటిద్దాం.

నటకులలో ముఖ్యంగా మూడురకాల వారున్నారు. దర్శకుడు తనకెంత డబ్బిచ్చినా సరే లెక్కచేయకుండా, పేరూ, ప్రతిష్ఠల కొరకు (Honest) నమ్మకంగా కృషిచేసే కళాకృషీవలులు మొదటి రకంవారు. వీరు అరుదుగానే యుంటారంటానికి కాంతి దాత యైన సూర్యుడు ఒక్కడుగా యుంటమే సాక్షి. తనకు ముట్టదానికి గిట్టుబాటుగా యుండే టట్లు (Commercial Balancing) వ్యాపార తత్వంతో సరి చూచి 'పిండికొలది రొట్టె' యన్నట్లు యాక్టు చేసేవారు (Second class) రెండవ తరగతివారు దర్శకునివద్ద నుండి వీలైనంతవరకు డబ్బు లాగి వేశ్యావృత్తికంటె నీచమయిందని తన వృత్తిని గర్హించి మొగానికి మసి పూసుకొని యెలాగో లాగు ఆ కాసేపు గడిపేవారు మూడవ తరగతి(Third class) నటకులు. వీరు నాట్య విద్యాహంతకులు. (Dramatic Art Killers.)

నటుకుడంటే తనలో లేని గొప్ప శక్తులను ఆరోపింప
చేసుకొని, టార్చిలైటుతో తన సాటి ప్రజలకు విజ్ఞాన నిధిని
చూపించే వ్యక్తి. నటుకుడంటే యెలాంటి గొప్ప వ్యక్తుల
నయినా గుటుక్కున మ్రింగి తన కడుపున పెట్టుకొనే, కాల
రాక్షసి యొక్క [illegible] టిను (spirit)
తనలో యిముడ్చుకొని వారి [illegible]త్వాన్ని ప్రజలలో
యుద్బోధ చేసే వ్యక్తి. నటుకుడంటే తన మనోవీధిని పరుగు
లెత్తే ఊహాపరంపరలను భావముఖంగా బహిరంగ పరిచే
కళాప్రియుడు. అనేక గ్రంథాల సారం గ్రోలి జీర్ణం చేసుకొని
సమయానుకూలంగా దానిని ప్రేక్షకులపై ఘాంటోకాలాగు కురి
పించే వరుణమూర్తి. నటుకుడంటే కవీశ్వరుల వ్రాతలు విప్పి
అవిద్వాంసులకు కూడా సుబోధకం చేసే పౌరాణికుడు. నటకు
డంటే కవీశ్వరుల వ్రాతలలోని మాధుర్యం తాను త్రాగి,
యితరులకు త్రాగినంత యివ్వగల్గిన మధుపము. నటకుడంటే
ప్రకృతిని ప్రతిబింబంగా చేసి తనలో నిజమైన ప్రకృతిని కన
పరచే తంత్రగాడు. నటకుడంటే యెన్న శతాబ్దాల క్రిందనో
కూరుకపోయిన వ్యక్తిని తానేనని బొంకి యొప్పించి మెప్పించి,
ప్రేక్షకులపై మచ్చు జల్లే మాంత్రికుడు. నటకుడంటే అతీత
మైన వేదాంతార్థాలకు కూడా పండితాసులభమైన శాస్త్ర
భావాలుకూడా 'యుఫ్' యని యూది ప్రేక్షకుని కర్ణపేయ
మొనర్చే వేదాంతి. నటకుడు సామాన్యుడు గాదు. ఇదంతా
నాకల్ల బొల్లి కబుర్లగంపయని పెదవివి విరుస్తారేమో! మీ

హృదయాన్ని మీరే ప్రశ్నించండి, నటకునిలో యట్టి శక్తి యున్నదో లేదో? యని

అలాంటిశక్తి తనలోనుందని గ్రహించక తానొక సంగీతపు మిషనో లేక గ్రామఫోనో యని తలచి ధనాశా పిశాచ గ్రస్తుడై కళోపాసనకు బూనడు పాత్రధారి. కళాదేవికి హారతినివ్వడు. అంతటితో యీదరిద్రావతారాన్ని వదలి కళాదేవి కాలికి బుద్ధిచెప్పుతుంది. తనశక్తి తానెరుగని కపి రాజేం చెయ్యగలడు? తను కేవలం కళాదేవికి పాద పూజకుడనియు, తనలో కొంత శక్తి యిమిడి నిబిడీ కృతమై యున్నదనియు, ఆశక్తిచే ప్రేక్షకస్వాంత విహారం చేయగలననియు, నటకుడు గ్రహించిననాడే అతనివిద్య వెన్నెలవలె వికసిస్తుంది లేనిచో నివురుగప్పి, నివురుగప్పి తేజస్సుపోయి విద్యాగ్ని చల్లారిపోతుంది ఆనటకునిలో.

ఈనవీన యుగంలో (In the work a day world) నూటికి అరవైమందిలో కళయనే వస్తువు మచ్చుకైనా కనబడదు కంచు కాగడాలతో వెదికినా! మిగతా వారిలో పాతిక మంది కోకిలకంఠులు. మిగిలిన పదునైదుమంది(Prose Drama actors) వచన నాటికానటకులు. రంగస్థలంపై నాట్యంచేసినా వీరే! వెండితెర వెనుక తైతక్కలాడినా వీరే! రేడియో శాకానూవినా వీరే! మరియిలాంటి నటకులతో వెండితెర వికసించే దెలాగు? నటకుడు పదునుకత్తిలాగు అన్నివిధాలా ఆరి

తేరి యుంటేగాని కళాపిపాసియైన ప్రేక్షకుడు చూచినఫిలిం చూడడు మళ్ళీ. దేశంయొక్క బాగోగులు అందులోనివసించే ప్రజలలో యున్నట్లు, ఫిలింయొక్క మంచి చెడ్డలు యాక్టర్సుపై ఆధారపడుతాయి కొంతవరకు.

డైరక్టరు ఎంతో కొండంతయాసతో ప్రారంభిస్తాడు ఫిలిం దీయడం. అలాంటి ఆయనయుత్సాహాన్ని ప్రోత్సహించే బాధ్యత నటకుని భుజంపై యుంటుంది. ఈవిషయం నటకు లెంతమంది గ్రహిస్తున్నారో వెండితెరమీదే చూడండి! స్వాతంత్ర్యేచ్ఛలోగాని, సామ్యవాదంలోగాని, పాలిటిక్సులో గాని, ఒక టేమిటి? అన్నిటిలోను స్త్రీ పురుషుడుగా మారిన యీరోజుల్లో (పురుషుడు స్త్రీగాకూడా లెండి) మనవెండి తెర మాత్రం పాపం స్త్రీని స్త్రీనిగానూ పురుషుని పురుషునిగానూ, యుంచి యిరువురి పరువు నిల్పింది. అలాంటి వెండితెరకు మనం ఎంతైనా ఋణస్థులం. ఇక తారామణుల సంగతి యాలోచిద్దాం

'మేకప్' లో యుండనీండి మరియే 'కప్' లో నైనా యుండనీండి వీరు తెరపైకి వచ్చేసరికి ముసలివారికి పడుచు దనమిప్పించేటట్లు కనపడతారు. త్యాగరాజ కీర్తనలు కలలో నైనా తలపక పోయినా ప్రస్తుతం లోకం నాలికకొరుకుతున్న భావగీతాల్ని (భాగోతాల్నియని పొరబడేరుసుమా?) వీరు బాగానమిలి చక్కగాయుమ్మేస్తారు ప్రేక్షకులుపై క్షమించండి!

ఏ కోకిలనో, ఏ రాజాకుసుమాన్నో. ఏమన్మథుని భాణాన్నో. లేక యే ప్రియునో తమయూహాగానంలో బంధించి, చెవులు చిల్లులు బడేటట్లు తమకోకిల కంఠాలతో ఏ విరజాజి పొదల మాటునో, ఉదయచంద్రుని చూస్తూ ప్రియునికొరకు ప్రేమ హారతులిచ్చే పడుచును చూస్తే ప్రేక్షకుని పై పెదవి క్రింద పెదవిని కొరకదూ మరి !

కాబట్టి వీరిలోకళ కొంతవరకు పిచ్చికళ యైనా మేకప్‌లో దర్శకుడు వీరిని రంభలను, యూర్వశిలనుచేస్తాడు. "పాత్ర ధారణే రంగస్థ నికి ప్రాణం" అన్నట్లు యీ మేకప్ చాలా చిత్రాలు చేస్తుంది. మూగనటకునికి సుభాషకుడని బిరుదిస్తుంది. చింతాకులంతేసి కళ్ళుగల నటీమణిని 'విశాల నేత్రి' యని పిలుస్తుంది. నల్లని కాటిపాపను 'పసిడిదేహి' ...ని భ్రమింప జేస్తుంది. ఫిలిం హృదయం రంజకంగా నుండాలంటే ముందు మేకప్ నేత్రోత్సాహాన్ని కాంక్షి 'what the eye does not admire the heart does not desire' కన్ను సెబాసనందే హృదయం దేని నీకోరదు. అనే మాట చాలా అర్థయుక్తం. చూడండీ యీ మేకప్‌లో పొట్టివారు. భారీవారవుతారు. నోరు విప్పితే పక్షి సంచారంకూడా ఆగిపోతుందని భయం కలిగితే మరియొకరి పాట యీమె కద్దె కిప్పిస్తాడు దర్శకుడు. అంతటితో కళయంటేమోమూ ఎరుగని యీపాటలేని పడుచు వెండితెరపై పొర్లాడుతుంది చూచారా! దర్శకుని దాక్షిణ్యం ! అయితే ఆపెలోని కుతూహలం అంత

బలమయింది. ఏ నటకుని భార్యగానో ఒకక్షణకాలం తెర పైనన్నా, రంగంపైనన్నా యుంటే పతిమొక్కని పాదాలు వదిలేసి, తన జన్మపావనమౌతుందని యేమో యీపెగారి ఆశ. కాదా మరి? దేశంలో స్త్రీ స్వాతంత్ర్యమంటూ లేదాయె (మహిళాసంఘాలు బయలుదేరకముందు మాటలెండి) ఒకస్త్రీ మరొక యువతితో నూట్లాడినా రంకులుగట్టి రంకెలు వేయడం సంఘకర్తవ్య మైపోయె! అందుచేతనే ఆ పడుచు పాటలేకపోయినా, నాట్యకళయంటూ తెలియకపోయినా, వెండితెరమీద పిండారబోసిన వెన్నెల వెలుగులలో తన ప్రియుని భుజంపై చెయివైచి ప్రేమ విమానాల్లో ప్రయాణం చేస్తుంది. ఇది యొకరకపు నటీమణి (Actress) చరిత్ర. బహుశా, యీమె యీ అల్పసుఖం కొరకే తెరవైపు తొంగి చూచిందేమో!

క్షమిస్తారూ? నిజం పలికితే! మరికొందరున్నారు. తమ సౌందర్యాన్ని మోసుక వచ్చి యువకుల వళ్ళల్లో కురిపించడానికే వెండితెరపైకాలు బెడతారు. ఇక వారి కంఠాలు సానపట్టిన కత్తులలాగుంటాయి. అటువంటి సన్నరస్థాయిలో వారే యువకుని భుజంమీదో చెయివేసే పాత్రనుగ ధరించరు. ఒక్కొక్కప్పుడు దర్శకుడుగూడా మిడుతవుతాడు వీరి సౌందర్యాగ్నిలో. కాదటే మరి, ఆయన మాత్రం మానవాతీత మైనశక్తి చాతుర్యాలు, కళావిద్యాకల్గియున్నా, మానవ మాత్రుడేగదా? ఇలాంటి స్త్రీ పాత్రలు స్టేజిఫియరు లేకపోవ

డంచే ఇక వీరు శృంగారరసం ఎంత కావలెనంటే అంతా కురిపిస్తారు. ప్రేమ ప్రవాహంలో దొర్లడానికి గానీండి; ప్రేమ వెన్నెలలో (ప్రేమయనే వెన్నెల ఒకటున్నదా వేరే) విహరించడానికి కానీయండి, అచ్చుగుద్దినట్టుగా సరిపోతారు. మరి దేనివారు దానికి లేకపోతే యెలాగు ? వీరొక తరగతి తారామణులు.

ఇక నూటికి పదిమందో అందులో సగమో దొరుకుతారేమో గాలిస్తే నిజమైన తారామణులు. వారిలో తాండవ మాడుతుంది కళాదేవి. వారేపాత్ర ధరించినా వెండితెరకు వన్నెదెస్తారు. 'ర_క్తి' యనే పదార్థం వీరివల్లనే ఫిలింకి కల్గుతుంది. వీరుతమ కళకు తగ్గలాభం పొందుతున్నారో లేదో, వెండితెరకే తెలుసు, వారికే తెలుసు, పరమ రహస్యం. ఈ యార్టిఫిసలు (Artificial beauties) కృత్రిమ సౌందర్యాల నాశ్రయించ నక్కరలేదు. తమ స్వసౌందర్యమేచాలు వెండితెరపై మొహరులు వేయడానికి. మరియొకపాటవీరినోట్లో పెట్టనక్కరలా వీరే యితరుల కొరకు కూడా అవసరమైతే పాడగలరు వీరే కళామూర్తులు. మరి వీరి ప్రైవేటు లైఫ్సులోకి మనం తొంగిచూడటం బాగుండదేమో. వీరు మొదటి తరగతి నటీమణులు. వీరి యావనమే వెండితెర సౌభాగ్యం. వెండితెర నిత్యకళ్యాణం పచ్చతోరణంగా యుండడానికి తారామణులే కారణం. వీరు కళాదేవికి హారతులిచ్చినంత కాలము మన వెండితెర దివ్య తేజంతో

వెలుగుతుంది. చూడండి! ఒక్క పది వత్సరాల్లో (Decade-) వెండితెర ఎంత ముందుకు వచ్చిందో.

మన ఫిలిం పరిశ్రమ, అమెరికాలోని హాలివుడ్ (Hollit wood)లోని పరిశ్రమతో కొద్ది నెలలలోనే పోటీ చేయగల దంటే అతిశయోక్తిగాదు. మానవునిలో సౌజన్యత పెంపొందుతూంది దానంతటదే. కళయం దభిరుచి కలుగుతూంది. చాలామంది కీ రోజుల్లో. అయితే అమెరికాలాంటి పారిశ్రామిక కేంద్రాలలోలాగు మన పరిశ్రమలు అభివృద్ధికి రావాలంటే మాటలతో రావు. మనకు యంత్రబలం తక్కువ. చూడండి, రత్నాలకొట్టవి పరదేశస్థులు పాటలు పాడిన మన దేశం యినుపచాకు ముక్కకు 'షెఫీల్డు' (Shefield) కి చేయి చాచాం, మోస్నే మర్యాదాకా. అలాంటి పరిస్థితులలో, అమెరికా కూలీని, అతని రేడియో సెట్టును, అతని టాక్సీ కారునూ చూచి మన మసూయ పడడ మెందుకు? కర్మాగారపు కూ కూ ధ్వనులు మనల్ని కలత నిద్రలో లేపగల్గుతున్నాయా? ఈ యినుప యుగంలో కర్మాగార మంటూ ఎరుగని మనకు యంత్రబల మెలా సమకూరుతుంది? యంత్రబలం లేంది ఏం చేయగలం? చివరకు 'ఫిలిం' పరిశ్రమలాంటి 'చిత్రకళ' (Fine Arts)కు కూడా మిషను సాహాయ్యం ముఖ్యంగదా? ఇది యొక కరువు. ఝుంషెడ్పూరి తాతా ఎంత మన కరువు తీర్చగల్గినా పరదేశాలకు చేయి చాచడం తప్పేలా మనకింకా. ఇక యీ చల్లారిన యుద్ధపు

పొగలలోనుంచి మన దేశానికి కర్మాగారపు పొగల భాగ్యం కల్గుతుందేమో ! ఏది యెలా వున్నా మన 'ఫిలిం పరిశ్రమ' (Film Industry) కూడా త్వరలోనే యున్నతస్థాన మలంకరిస్తుందన్నమాట మాత్రం నిజం.



ఈ వ్యాపారయుగంలో వర్ణభేదాలు లేకుండా ప్రతివారూ బెనిఫిట్ కనిపెట్టి వ్యాపారులుగా మారిపోయారు. ఏ కొద్ది పెట్టుబడితోనో చిల్లరదుకాణం బెట్టిన పెద్దమనిషి కొద్ది నెలలలోనే తన దుకాణంతో సహా వెండితెరపై గనపడతాడు. చిల్లరదుకాణం వెండిదుకాణ మవుతుంది. లాభాల పైని లాభాలు చూచారా ? వెండితెర తనను తానే గాక యితర విషయాలుకూడా ఎడ్వర్టయిజు చేసి డబ్బు సంపాదిస్తుంది. నెల కింతని యీ షాహుకారు డబ్బు చెల్లిస్తే అన్నాళ్ళూ తెరమీద ఆయన నొక క్షణం అతికిస్తారు.

కేవలం సంగీతమంటే అసహ్యించుకొనే ధనాశాపరులైన కొందరు బిజినెస్‌మెన్‌కు కూడా వెండితెర మేలు చేస్తున్నది. 'సినిమా' అంటే భోగంయిల్లని, కల్లుదుకాణ మనీ యేవగించుకొనే కొందరు వ్యాపార్లుకూడా తమ శ్లాక్ ప్రతిదినం చూపిస్తున్నారో? లేదో? అని అయినా తెరముందు నిలబడతాడు వారాని కొకసారి. మరియొక లాభ మేమిటంటే, తన 'ఛాయాచిత్రం' (Photo) వెండితెరపై చూచి తాను మురుసుకొనడమే గాక, తన స్వాంతఖర్చులతో తన మిత్రులను కూడా 'సినీమా'కు తెస్తాడు ఫిలిం గొప్పదని గొప్పలుకొట్టి. ఇదంతా దేనికి? పాపం (Art) కళయనే మాటకూడా అర్థంగాని యీ అమాయకుడు తారామణులు దొర్లాడే ప్రకటన మీదకు ప్రాకాననే సంతోషంచేత. ఆ సినిమా ప్రపంచంలో తనకో పెద్ద (share) భాగం ఉందనికూడా అనుకుంటాడు పాపం. భార్యదగ్గర,

'ఏమేవ్' చూచావా! అదెవరో బలేయుందకత్తె. అది తెరమీద పాటపాడుతూనేవుంది. 'నాప్రియుడా' రావోయీ నావిరహబాధ పోకార్చగా అనేసరికి ఫిలిం తెగింది. టక్కున నాఫొటోను దానిమీద పడేశారు. ఏమిటనుకున్నావ్. నాలో కళ లేదంటివే? ఎంత కళలేంది వెండితెరమీది పడుచు పక్కన పడుగులు తీశాను ఆమె చెంగులు తగిలేటట్లు! అని ఉబుసపోక కొడుతాడు. ఇలాంటి ఆశలతో ఒకటి రెండుసార్లు ఫిలించూచేసరికి ఎంతమూర్ఖుని కయినా ఆస్టయుందు ఆపేక్ష కల్గుతుంది.

కల్గితీరాలి ప్రేక్షకునకు హృదయముంటే. మ్యాజిక్ అంటే మోజుగలుగుతుంది. నర్తనమంటే రుచిగలుగుతుంది. అతను కూడా ఒక కళాపిపాసి యౌతాడు. ఇది వెండితెర ప్రభావం. ఎలాంటి మానవుణ్నైనా కళాప్రియుని గానూ, రసికునిగానూ మార్చే ప్రభావం మన రజితతెరకుంది. అందుచేతనే కాలం గడచినకొద్దీ ఫిలిం పరిశ్రమ వృద్ధిలోకి రావటం తటస్థిస్తోంది. ఇక యీ సినిమాలోకంలోని (Civilization) నాగరికతను చూద్దాం.

ఈనవీన యుగంలో గంట గంటకు, నిమిష నిమిషానికి మారే ఫ్యాషన్సు (అవసరంగాని అలంకారాలు) సినిమా తెరను చూచి సవరించుకోవడం మామూలయింది. వర్తకులు ఆంధ్ర పత్రిక చూచి ధరలలో మార్పుగమనించినట్లుగా. తెరమీది నీడ ఏ వేషం వేస్తే ప్రేక్షకవర్గం ఆవేషం వెయ్యాలని కుతూహాల పడుతుంది. ముఖ్యంగా చూడవచ్చిన స్త్రీలలో (90 %) నూటికి తొంబదిమంది ఫ్యాషను కేటలాగును రిఫర్ చేయుడానికే వెండితెరను తెరుస్తారు. ఇక యింటికి వచ్చింది మొదలు 'ఏమండీ రాత్రి కమలవల్లి కట్టినరకం చీర నాకు తెచ్చి పెట్టరూ? పోనీలెండి నాకంటె ఆ తెరపైనినీడ నయం కాస్త నీటుగా నాటుగా బ్రతుకుతూంది. చీరలన్నీ చిల్లులు బడ్డవేగద!" అని ఆనాటికి నాంది వేస్తుంది. సరే ఆపె కదే ధ్యాస కాబట్టి చీరలు రవికలు చూచింది. ఆయనగారు చెక్కిళ్ళపైనే చూచాడు గాని క్రిందచూడ లేదాయె. ఏంచీరో చూడటానికి మళ్ళీఆనాడు

రాత్రి సినిమాకన్యయింటికి ప్రయాణం. అనాడు గడుస్తుంది. రెండో దినం "ఏమండీ నామనసంతా ఆచీరమీదే వుంది. ఆచీర కట్టుకొని మీ ప్రక్కన నిలబడితే చాలా బాగావుంటుందని మన ప్రకాశ్‌కి పదిన్నరసార్లు అంది" యీ తంత్రంతో మగ వాడు నీరౌతాడు. వెంటనే ఫోను 'సిల్కుపాలెస్' (Silk-Palale) కో పరుగెత్తుతాడు. ఆయన జవాబో? 'అదివో రకం చీరో రాత్రికి మనమిద్దరమూ సినిమాకు వెళ్ళి చూచి వద్దాం తప్పనిసరిగా వస్తారుగదూ! 'ఆ వస్తాను, మరిచేరుసుమా' అని యీసూరయ్య వెళ్ళిపోతాడు. కాలదేవతకళ్ళు తెరుస్తుంది. తెల్లవారుతుంది. 'ఏమేవ్ కాఫీ తయారయిందా.' 'ఒంటిమీద గుడ్డ లేకపోతే పోయిందిగాని మీమూతిమీసాలు దగ్గరనుంచి పైకెత్తి వేడికాఫీ నోట్లోపోయాలి' అనిగొణుగుడు. 'ఏం పలుకవు' 'చీరతెచ్చావని పలుకుతుందా' అని కూతురు జవాబు. చాలావరకు పోయిందే. కథఅని ఒక్క నిట్టూర్పు నేలమీద విసరి సిల్కుపాలెస్‌లో దిగుతాడు: 'ఏమండీ బాబుగారూ! ఆచీరలు కాశ్మీర్ చీరెలు. అవి చాలా ఖరీదుగలవి సుమా! అవి భోగంవాళ్లు కట్టవలసినవేగాని మనమేం కడతామండీ! అందుకే మేమవి తెప్పించంది! అని చావుకబుర్లు చల్లగా చెబుతాడు సిల్కుపాలెస్‌లో మేనేజరు. పాపం యీయనగారి కాళ్ళుచేతులు చల్లబడుతాయి. ఏంచేయాలో తోచక డైరెక్టు ద్వారా కరస్పాండెన్సు జరిపి చీరె తెప్పిస్తామన్నదాకా పోతుతుందాయన గారి యూహారథం.

ఇదీ మనస్త్రీలలో కొందరు కాశీనుండి కొంగ పెట తెచ్చినట్లు, సినిమా తెరనుండి తెచ్చేది. ఇంత అమాయకపు జనం సినిమా తెరలముందు వ్రాలడం దేనికి? భర్తల ప్రాణాలు బలిగొంటానికా? తాను చూచేదానిలో నే విషయం గ్రహించాలి? ఏ నీతినేర్చుకోవాలి? ఏ భావాన్ని పట్టుకోవాలి? ఏ మంచిని అర్థంచేసుకోవాలి! అనేమాటే యుండకుండా ఏ స్త్రీ వంటి మీది గుడ్డో తనకు కావాలంటే తెరమీది నీడ లెలా వస్తాయి? యీపెర్రి భ్రమేగాని. ఇంకా విపరీతాలున్నాయి సుమా! ఏ చెంచుభామో, మరియే చెంచులక్ష్మో పాత్రౌచిత్యత కొరకు (Historical Make-up) చరిత్రాత్మక పాత్రధారణ మొనర్చి రవిక లేకుండా తెరపై కనబడితే ఆ మరునాటినుండి దాని అనుకరణ (Imitation) ప్రారంభమా! నటకులలోని కళామాధుర్య మర్థం చేసుకోవాలి. తారామణుల అభినయ ప్రదర్శన మేమి! సంగీత విజ్ఞాన మేమి? ఇవి అవగాహనచేసుకొని మనఫిల్ములు యింతబాగా తయారగుతున్నాయని గర్వించాలిగాని అనానుకరణీయమైన విషయాలతికించుకోడం తప్పుగాదా? అనుకరింపతగ్గవి అనుకరించవచ్చు. ఉదాహరణకు సినిమాతారల గానమాధుర్యాన్ని మనం కొంత దొంగిలించవచ్చు. స్త్రీలు ముఖ్యంగా పాటలు తారామణుల మోడరన్ స్టైయిల్సు అనుకరించి తమ ప్రియులను జలకమాడించవచ్చు తమగాన వారధిలో. కాదండీ మరి! స్త్రీ సృష్టిచిత్రంగా కనుపిస్తుంది.

పురుషుడు యేయినప ముక్కు—నో సాగనొట్టి తయారు చేయబడ్డ తగట్టిగా కనబడుతాడు. మరి స్త్రీ తల్వం వెలాం టిదో పైకమెత్తంది గా కనబడుతుంది. వారి కొర్కెలుకూడా పైకమెత్తని వే. ముఖ్యంగా పురుషుడు స్త్రీవలె కుసుమ పూజ చేయలేడు. ఇక (Ornamentation) అలంకరణయ దు స్త్రీకు గల ఆసక్తి పురుషునకులేదు టాయిలెట్ చేయటానికి ప్రతిపదుచు, పిల్లాకూడా, కొందరు ఆధునిక వృద్ధులుకూడా లెండి, ఒక సినిమాతార మేకప్ కు తీసుకున్నంత కాలం తీసు కు టాడి. ఈ టాయిలెట్ అయినా పైమెరుగేగాని పైన పతారం లోపలలోతారం. చూడండి, ఆడవాళ్ళ ప్రయాణం అనే సామెత మనంతరుచువాడుతూనే యుంటాము. సాయంత్రం రెండుగంటల నుండి ప్రయత్నం చేస్తే అరగంట లేటుగా సినిమా వశీలోకి దూరగల్గుతాం ఆడువారితో. ఇంత టాయిలెట్ చేసినవారుకొనేది, మనం కొనేది ఒకేటికెట్టు. ఓకాని కత్తి రిస్తాడేమోనంటే ఆమెముఖం చూచైనా టికెట్టులో, ఉహూ. చూచేది యొకే ఫిలిం: వాడేదీ, వినేదీ యొకేభాష. ఇక రాగా పోగా తెరపైన కన్పడే తారలతో దోబూచులాడడానికా ? లేక వారికి సిగ్గుగల్గించడానికా ? యీ తళుకు బెళుకులన్నీ. 'Too much is nonsense' అనే ఆంగ్ల సామెతకు సరి పోతుంది ఎగ్జాక్టుగా. వీరు సైంటిఫిక్ పద్ధతుల ప్రకారం దేహా రోగ్యం కాపాడుకొంటున్నారా? No they want always to be slim and slim' చూడండీ, ఉదాహరణకు ఏ సర్కసు

కన్నో తీగలపై పరుగులెత్తడానికి ఎక్సరుసైజు చేసి మితాహారం పుచ్చుకొని దేహాన్ని కంట్రోలుచేసి సన్నగా తయారు అవుతే, కావాలని తిండితిప్పలూ సరిగా తినక మనవారు నూదులవడానికి విశ్వప్రయత్నమా? సిగ్గుచేటుకూడా?

వెండితెర కేవలం వీటినే కాకుండా పాతివ్రత్యము, స్త్రీ ధర్మాలు మొదలైన నీతులుకూడా బోధిస్తుంది స్త్రీలకు. మరి మంచికీ చెడుకీ యుండే అవినాభావ సంబంధంచేత Where 'there is light there is shadow' కాంతియున్నచోటే చీకటి యుంటుంది. విజ్ఞానాన్ని అజ్ఞాన మాశ్రయిస్తుంది. వెన్నెలరాత్రులను చీకటిరాత్రులు తరుముతాయి. కాబట్టి వెండితెరకూడా కొంతవరకు మానవనిర్మాణమవడం చేతగానీండి, మానవసహవాసం చేతగానీండి వెండితెరకు కూడా తిరగేవు, మంచివైపు యున్నాయి. అందుచే మనం హంసల్లా పాలను నీటినుండి విడదీయాలి. కాని మంచిని వదిలేయడమో లేక మంచిని చెడుగా మార్చడమో చేస్తారు పాపం ప్రేక్షకులు దీనికి తెర జవాబుదారి కాదు సుమండీ. ఇక నటకుల సామాన్యమైన ప్రైవేట్ జీవితాలు విమర్శిద్దాం.

(30%) నూటికి ముప్పదిమంది నటకులు సారా సహవాసమో, లేక బ్రాందీ భ్రమో, మరి విస్కీవియ్యమో కలవారే దమ్ముకోసం త్రాగేవారు కొందరు. సహవాస దోషాన త్రాగుడు మరిగేవారు మరికొందరు. మరికొందరు రంగూన్ రౌడీపాత్రను ధరిస్తున్నామనే నెపంతో సారాబుడ్డీలతో

స్నానంచేసి సారా పొగలు వదులుతారు స్టేజీలపై. సర్దాకు డోస్ వేసేవారు కొందరు, దమ్ముకోసం యీ దుమ్ము నోట కొట్టుకొనడం దేనికి చెప్పండి? ఈ త్రాగుడుతో రంగస్థలానికి గౌరవం తగ్గుతుందా, తగ్గదా? మరి. ప్రతి మానవుడు యే స్ఫియర్ ఆఫ్ యాక్టివిటీలో తన జీవితరథం నడుపుతున్నా సరే ఒక విధమైన గౌరవాన్ని నిలబెట్టుకోవాలి. 'జన్మలలో కెల్ల యుత్తమమైన జన్మ నాది యని గ్లోబును తన కాలితో తొక్కిబట్టి ఆకసాన్ని ఛత్రంలాగు చేసికొనే యీ మానవుడు నీచత్వానికి పాలుబడితే యిక లోకంలో గౌరవానికి తావెక్కడిది.' పోనీ యీ డ్రంకర్డ్సువల్ల స్టేజీకి కొత్త వెలుగేమైన సమకూరుతుందా అంటే శూన్యం. వ్రతం చెడ్డది. ఫలమూ లేదు. గొప్ప యాక్టర్లని పేరుపొందిన నటకులు ఎంతమంది త్రాగుడు పిశాచి దాసులై తెరలముందుకు వచ్చి 'యివ్వాళ పాడలేము క్షమించండి! ఈలలు వేయకండి. తిట్టకండి, కొట్టకండి ఒన్సుమోరులు. మీకు నమస్కారాలు'. అని ప్రేక్షకుల గడ్డములు పట్టుకొనలేదు. ఇది నటకునికి గౌరవమేనా? చిన్నతనమునుండీ తాను కూడబెట్టిన ఆరోగ్యం పాడుచేసుకొనడమే గాకుండా, తా మిదివరకు స్టేజీలపైకెక్కి సంపాదించిన పేరు ప్రతిష్ఠలుగూడా గాలికి తూరుప్పాల పోయడం గౌరవాభివృద్ధి లక్షణం గాబోలు?

ఇక స్మోకింగు సంగతి ఆలోచిద్దాం. ఇదీ ఒక విధమైన త్రాగుడే, పొగత్రాగుడు. దీనికి సంగీత పాటకునికీ

గిట్టదు. ఇది యూపిరితిత్తులలో వంటయింట్లోని మసివలె, ఒక నల్లని విషపదార్థమును కూడబెట్టి, బ్రెత్‌ను షార్ట్ చేసి గొంతు శ్లేష్మపూరితం గావించి, కంఠ మాధుర్యాన్ని కాల్చేస్తుంది. (80%) నూటికి ఎనుబదిమంది పొగ త్రాగువారే. ఒకాయనకు బీడీపొగ మ్రింగితేగాని సంగీతం బయటకురాదు. మరియొకాయనకు సిగరెట్టుపొగలు ఆఘ్రాణిస్తేగాని ముక్కు బిగింపు తగ్గదు. లేకుంటే వే అనునాసికలో బయలు దేరుతాయి. ఇక నాశికా విధ్వంసక చూర్ణం, పండితామోదమును బడసిన దగుటచే, దానిని విమర్శించడం పండిత క్రోధాగ్నికి బలి యగుటయే.

ముక్కుపచ్చలారని పదునా రేండ్ల బాలురు రంగస్థలాలను రసాల వృక్షాలుగా మార్చి తాము కోకిలలై కూసి ప్రేక్షకులకు, జోలలు పాడుతారు కొత్తల్లో. కొన్నాళ్లు జరిగేసరికి జేబు బరువెక్కుతుంది. డబ్బుతోగాదు. సిగరెట్ అండ్ నిప్పు పెట్టెలతో! ఈయనగారి పాలపీకకు మసిబట్టి కొద్ది దినాలలోనే అధోపతన మవుతాడు రంగస్థలం నుండి. దానితో 'పెక్కుభంగులు వివేకభ్రష్ట సంపాతముల్' అని చెప్పిన కవిగారి గంగాపతన వర్ణనలోవలె అథఃపతనమైన యీ నటుడు మళ్ళీ రంగస్థలంపై తల యెత్తడం దుస్సాధ్యం. ఇది స్మోకింగు, డ్రింకింగులవల్ల కలిగే నష్టం నటులకు. వేశ్యా వృత్తిని దూషించి, త్రాగుడును 'ఈ త్రాగుడే గదా.........' అని నిరశించి యుపన్యాసా లిచ్చి మాన్పించుటకు యత్నించే

యీ నటకాగ్రగణ్యులకు పై విషయాలు తెలియవనిగాదు నా మనవి. కాని యిదియే ఖ్యాపను అనే యుద్దేశ్యంతో వానిని మానివేయడానికి వెనుకడుతున్నారు. గౌరవ హీన మని నటకులెల్లరు ఈ దురభ్యాసాలు మాని, కేవలం కళా ధ్యాపకులై, కళాదేవికి హారతు లిచ్చిననాడే మన రంగస్థలం పన్నెకెక్కుతుంది. ఇలాంటి నటకులను తెనవడిలో వైచుకొని ప్రేక్షకులకు చూపించి తాను ముఱసుకొనే వెండితెర మన ముస్థల మూటగాక మరేముంది? ఇన్ని చిత్రాలను చూపించి మనచిత్తం దొంగిలించే వెండితెరలు గూర్చి కొంతనేర్చుకొన డం మన విజ్ఞానానికవసరం.

ఈకళ (Art)కు సినిమటోగ్రఫీ (Cinematography) అని పేరు. సినిమాటోగ్రఫీ అంటే (Moving Picture) చలన చిత్రము అని అర్థము. పదునేడవ శతాబ్దంలో (Kircher) కిర్చర్ అను మహాశయుడు మాజిక్ లాంటరన్ను కనిపెట్టాడు. దీనిలో ముఖ్యంగా ఒక లాంటరన్ యుంటుంది (Source of Light) దాని కాంతిని ఒకే వైపుకు కేంద్రీకరించే రిఫ్లెక్టర్ (Reflector) వుంటుంది. ఆ లాంటరన్ ముందు ఒక (Lens) కటకము బింబగ్రహణానికై యమర్చబడి యుంటుంది. కటకము ప్రక్కన (Magnifying Lens) స్ఫుటీకరణ కటకము, లాంటరన్కూ కటకమునకు మధ్య స్లైడ్ (Slide) అమర్చబడి (fit up) వుంటాయి.

లాంటరన్ నుండి వచ్చే కాంతి రిఫ్లెక్టరుచే ముందుకు నెట్టబడి స్లైడ్ కుండా పోయి కటకముపై పడును. కటక కేంద్రమువద్ద (At the Focuss) స్లైడ్ పై నుండే చిత్రప్రతి బింబ మేర్పడును. ఆ ప్రతిబింబము స్ఫుటీకరణ కటకముపైబడి పెద్దదై ఎదురుగా వుండు తెర (Curtain) పై బడును. ఇది మాజిక్ లాంట్రన్ యొక్క జీవిత చరిత్ర.

(Thomas Edison) థామస్ ఎడిసన్ అను ఒక ఆంగ్ల విజ్ఞానవేత్త (western Physician) మాజిక్ లాంటరన్ నుండి చలన చిత్రం (Cinematography) కనిపెట్టాడు. ఈతని యీ యిన్వెన్షనే మనకు చలనచిత్ర భిక్ష పెట్టింది. లోకానికి కళాదేవిని ప్రసాదించింది. ప్రపంచంలో 'నాగరికత' (civilization) అనే వస్తువును చౌక చేసింది. సర్వకాల సర్వావస్థలయందు సుఖమంటూ యెరుగక, ధనార్జనయే జీవిత పరమార్థమని తలచే అమాయక జనంలోకూడా కళాపిపాసత్వం కలిగించిది. గరుత్మంతుడు యింద్రునితో పోరాడి తెచ్చిన అమృతకలశం కంటె ఎక్కువ విలువగల పదార్థం తెచ్చాడు మన 'ఎడిసన్' గారు. అతనికి కళారాధకుల మగు మన మెంతగానో కృతజ్ఞులం.

(Magic Lantern) నుండి సినిమటోగ్రఫీ కనిపెట్టారనేవార్త మర్కటంనుండి మనుష్యుడు డెవలప్ అయినాడన్న డార్విన్ (Darwin) గారి సందేశంవలె హాస్యాస్పదంగా తోస్తుంది. కాని విమర్శించి Analyse చేసిచూస్తే 'చలన

చిత్రం' మాజిక్ లాంట్రనే. మాజిక్ లాంటర్ణ్ లోని చిత్రాలు కాగితంమీది బొమ్మలవలె కదలలేవు. (Moving Picture) చలనచిత్రంలోని చిత్రాలు ప్రాపంచరంగంపైనున్న మనుజులవలె చలించగలవు. ఇదే యీ రెంటికీనున్న భేదం.

చలనంగా ఫోటోలు తీయడానికి ప్రత్యేకరకపు కెమేరాలున్నాయి. మన మామూలు ఫోటోగ్రాఫర్ల కెమేరాలు వానియొక్క 'హార్సు రేస్' *(Horse race) ని బట్టి వేరు వేరు పోజులలో సెకండున కిన్ని చొప్పున ఫోటోసీరీస్ ను గ్రహిస్తాయి. యీ ఫోటోగ్రాఫిక్ సీరీస్ ను వేగంగా తెరపై ప్రదర్శించినపుడు 'ఈ ప్రపంచమంతా మాయ, మనకు కనబడేదంతా భ్రమ. తూర్పునుండి పడమటిదెసకు పరుగులెత్తే సూర్యుడు కదలడంలేదు. అచలమై జడ పదార్థంవలె యగుపడే భూమి అగణ్యమైన వేగంతో (with Incalculable speed) తనచుట్టూ, సూర్యునిచుట్టూ కూడా పరిభ్రమణ మొందుచున్నది అని పారమార్థాలు బ్రద్దలుకొట్టే యీ మానవునికూడా మోసపుచ్చు తున్నాయి. నిజానికి వెండితెర గారడీ వంటిది. తెరపైన చిత్రాలు చలించవు. అవి చలించునట్లగపడడం మన (Optical Illusion) దృష్టిభ్రమ పదునారు సెకండ్లవరకు తానుచూచిన దృశ్యాన్ని కనీనికాపటలం (Retina) అదృశ్యం చేయదు. ఈ కాలంలోగా నెనుకటి చిత్రంయొక్క మరియొక ఫోటోను రెండవ పోజులో మన

---

* Measuring unit of power.

కళ్ళముందుబెడితే, ప్రథమచిత్రమే తెరపైనుందని తలు స్తాము. ఇది ఛాయాగ్రహణంలోని చిత్రం.

ప్రకృతిలోని దృశ్యాలను ప్రేక్షకుల దృష్టిపథాల్లోనికి తేవాలంటే చిత్రోత్పత్తికారులు (Film Producers) నిజ మైన ఆ దృశ్యాలవద్దకేగి ఆ దృశ్యాలను తమ సెల్యులాయిడ్ ఫిలింతో పెట్టుకొని తేవాలి. ఏ నాటకమో, ఏ కథో తెరపై చూపాలంటే ఆ గ్రంథంలో చెప్పినట్లు ఆయా సీన్సువద్ద ఆయా కథా ఖండాలను ఫిలింతీయాలి. ఈసీన్సు, సెట్టింగుల కొరకు అవసరమైతే ఆయా ప్రదేశాలకు పోవడం లేకుంటే కర్టెన్‌లతోను, అట్టలతోను మాయాబజారులు క్షణంలో సృష్టించి స్టూడియోలలోనే ఫిలింతీస్తారు. కథనంతా తరువాత (Hyate) కనిపెట్టిన సెల్యులాయిడ్ రిబ్బన్ పైకి కథాక్రమా న్ననుసరించి లాగాలి. ఈ "రిబ్బన్" ను ఫిలిం (Film) అంటారు. ఒక్కొక్క చిత్రం కంప్లీటయేసరికి షుమారు 10 నుండి 20 వేల అడుగుల పొడవుగల సెల్యులాయిడ్ రిబ్బను గ్రమింగుతుంది. ఒక్కొక్క ఫిలిం లక్షలకొలది రూపాయలు కరిగిస్తేగాని తయారుగావదు. ఇక్కడ రిబ్బన్‌లో (Celluloid Ribbon) చిత్రాలను తెరపైకి మోసుకవచ్చే యంత్ర భాగానికి ప్రొజెక్టర్ (Projector)అని పేరు. మాజిక్ లాంట రన్‌లో యుండే (Gas Light) గాస్‌లైట్‌కు బదులు దీనిలో ఎలక్ట్రిక్ (Arc light) విద్యుచ్ఛాపం యుంటుంది. దీనిలోని చిత్రాలు వెనుక చెప్పినట్లు రిబ్బన్‌పై అమర్చబడుతాయి.




## PROJECTOR—SOUND HEAD

1. Upper Magazine 2. Lower Magazine 3. Take-off sprocket 4. Intermitant sprocket 5 Hold Back sprocket 6. Sound sprocket 7. Take up sprocket 8. Automatic shutter 9. Lens 10. Revolving shutter 11. Arc Lamp 12 Sound Gate. 13. Optical Lens 14. Exciter Lamp 15. Photo Electric cell.

కాని సైదన్ను పైనికాదు. ఈ రిబ్బన్ (Spool) స్పూల్ పై చుట్టబడియుంటుంది. ఈ 'Spool' ను కప్పియుండు పేటికను upper Magazine అంటారు. యీ ప్రక్క చిత్రములో చూపబడినట్లు Upper Magazine కి దిగువ భాగమున Upper Take-off sprocket యుంటుంది. ఈయంత్ర భాగము పని రిబ్బన్‌ను స్పూల్ నుండి దిగువకు పంపుటయే. దిగువకు నెట్టబడిన యీ ఫిలిం రిబ్బన్ ముఖ్యంగా విద్యుచ్ఛాపము నుండి వచ్చు కాంతికిరణముల కుండాను (In the projector) Exciter lamp ఎదురుగా Soundgate, Optical lens మధ్యగాను (In the Sound Head) పరుగిడి Lower take up sprocket చేత దిగువకు నెట్టబడి Lower Magazine లోని spool నకు చుట్టబడుతుంది. (Arc lamp) విద్యుచ్ఛాపమునుండి వచ్చు కాంతికిరణములు Automatic shutter చే తాత్కాలికముగా స్వల్పకాలము అవసరమైనపుడు నిరోధింప చేయవచ్చును. రిబ్బన్ పై పడ్డ యీ కాంతి కిరణములు కటక ద్వయము దాటి, అనావశ్యకము కాంతిని నిరోధించు Revolving shutter అను ఒకవస్తులాకారి పరివర్తచక్రపు కేంద్రరంధ్రము గుండా పోయి తెరపై బడును. సెల్యులాయిడ్ ఫిలింపైన యుండే. చిత్రమునకు ప్రక్కన కానుపించుగీతలు మానవునకు నాలికవంటివే. ఆ గీతలు లేనిచో (Silent Picture) మూగఫిలిం అవుతుంది. ఈ సన్నని రేఖలు (Sound Track), Sound Head యను యంత్ర భాగములో

ని Sound gate ను అనుకొని దిగువవస్తూలునకు ప్రయాణము చేయునపుడు సజీవములై Photo electric cell చేత సృష్టీకృతములై 'Amplifier' అను యంత్రభాగముచే స్ఫుటీకృతము లౌతాయి. యీ స్ఫుటీకృతశబ్దమును ప్రేక్షకకర్ణములు అత్యాశక్తితో వింటాయి. ఇది సామాన్యముగా ప్రతి కళామందిరమున (In every Theatre) యుండు యంత్రము. ఈప్రక్క చూపబడిన చిత్రము సామాన్యచిత్రము. ఈ యంత్రభాగము భౌతికముగా నానారూపముల యున్నను, రిబ్బన్ యొక్క వక్రపథమునందలి భేదమే గాని మిగిలిన భాగములు సామాన్యముగా యీ చిత్రమునందున్నట్లే అమర్చబడి యుండును. ప్రణయచిత్రాలు తెరపై గనపరచునపుడు మనకు గానుపించు సప్తవర్ణములు రిబ్బన్ పైనయున్న చిత్రపురంగులే. రంగుటద్దములు (Coloured glass) కిరణపథంలో యుంచుటచే వచ్చినది ఏకవర్ణమే. ఎడిసన్ (Thomas Alva Edison) గారి ఫోను విరామ కాలం పూరిస్తుంది కళామందిరంలో. పాట ఆటకలిపి ఫిలింతీయుడానికి (Synchronization) అంటారు.

ప్రపంచంలోనున్న చిత్రనిర్మాణ రాజ్యాలలో (Film producing countries) అమెరికా యొకటి. కాలిఫోర్నియా లోనిలాస్ యేంజెలస్ (Los Angelos) హాలివుడ్ (Hollywood ఫిలింపరిశ్రమకు పెట్టినది పేరు. బొంబే, కలకత్తా, మద్రాసు మొదలగు ప్రధాన పట్టణాలలో స్థాపింపబడి, సాగుతూ యున్న మనఫిలిం యిండష్ట్రీ యిపుడు చాలావరకు ముందుకు

వచ్చింది. ఫిలుములు వివిధ భాషలలో కూడ తయారగు చున్నాయి మన దేశంలో. కారణం? మన దేశం, దేశంకాదు ఖండం అనడమే. అనేక భాషలు, అనేకజాతులు 'ఇండియా' అనే గూట్లోదాగియున్నారు. వీరందరికి గల కళాపిపాసత్వం ముదావహం. దానికొరకే ఫిలిం, అనేక భాషలలో ముఖ్యంగా హిందీ, తెలుగు, అరవం, కన్నడం, బెంగాలీ భాషలలో తయారు చేయబడుతూంది. వీనిలోకూడా, తమిళ చిత్రాలు హిందీ సినిమాలు, తెలుగు ఫిలుములు ముఖ్యతమం.

ఫిలుములు యే భాషలోనున్న (Irrespective of the language of the film) వానిని ముఖ్యంగా మూడురకాలుగా విభజించవచ్చు. అవి పౌరాణిక, సాంఘిక, చరిత్రాత్మక చిత్రాలు.

పౌరాణిక చిత్రాలు వెనుక ముచ్చటించినట్లు ప్రేక్షకులలో భక్తినికల్గించి వారిని పౌరాణిక యుగాలలోకి తీసుకొనిపోయి మానవుని కతీతమైన (యిప్పటి కాలం మానవులకు లెండి!) నీతుఁలు బోధిస్తాయి. యివి ఎపిక్సు (Epics) నుండి తీసినగాధలగుటచే ప్రేక్షకుల హృద్బంధనం గావించి వారి మనోకేంద్రీకరణంచేసి చక్కని బోధగావిస్తాయి.

పౌరాణికఫిల్ములు కొన్నియుగాల నాటిమాట ముచ్చటిస్తూంటే, చరిత్రాత్మిక చిత్రాలు కొన్నిశతాబ్దాల వెనుకకు ప్రేక్షకుని తీసుకొనిపోయి యే అశోకుని బౌద్ధపీఠంవద్దనో, ఏ షహాజహాను నెమలి సింహాసనంవద్దనో, ఏ నూర్జహాను కాంచన కిరీటంవద్దనో, ఏ పిచ్చితుగ్లకు తోలు నాణ్యాలరాసి ప్రకటనో

నిలబెడతాయి. ఈ ఫిల్ముల్లో కీవియెక్కువగా కనబడుతుంది. (Make up) పాత్రధారణ, డ్రస్సింగ్ కష్టసాధ్యం, ఖరీదూ కూడా అవుతాయి. వీరత్వం, న్యాయపరిపాలన, ప్రజాసౌక ర్యములు కలిగించు నేర్పు మొదలగునవి రాజుయందున్నచో ప్రేక్షకుల కళ్లల్లో ఆయనగారు దేవుడవుతాడు. అలాంటి పరి పాలనామృతానికై నడిఎండాకాలములో మండుటెండనీడన ప్రయాణముచేసి, యెండమావులను గాంచి, నీటికుండలని మోసపోయిన బాటసారివలె ప్రేక్షకుడు తనదురదృష్టాన్ని వేనోళ్ల తిట్టుకుంటాడు. తెరపై చూచివచ్చిన యే అశోకుని బౌద్ధమత వ్యాప్తిని గూర్చో, తనచిన్నకుమారుడు హిందూదేశ చరిత్రలో చదువుతూవుంటే కొత్తరుచులతో వింటాడు పాపం, ఆనాటి పేదప్రేక్షకుడు. ఇక ఆధునిక సాంఘిక చిత్రాలను గూర్చి కొంత తెలుసుకుందాం. వీటిజీవిత చరిత్ర(life history) బహుచిత్రంగా వుంటుంది.

మానవుడు రానురాను కాలికి తగిలి తేనేగాని వస్తువును కనిపెట్టలేని గ్రుడ్డివలె. తనదృక్పథానికి తగిలిన వస్తువును మాత్రమె చూడగల్గుతున్నాడు. దివ్యదృష్టి యనేపదం ఆధు నిక (up to date) నిఘంటువులనుండి తొలగించబడినట్లు తోస్తుంది. పదార్థస్వరూపం చూస్తేనే దానియెక్కి ఉనికిన్ని (Existence) ను నమ్మడం. లేకుంటే ఆపదార్థం లేనిదానితో జమే యనే వేదాంతులు బయలు దేరారు. ఉదాహరణకు 'దేవుడున్నాడా? లేడా? అనేవాదన తీసుకోండి.' 'ఉన్నాడు

అనే ఆ స్తికుని 'నీ దేవు డెక్కడున్నాడో చూపించు' అంటాడు నాస్తికుడు. దేవుడుకూడా అగోచరమైన ఒకశక్తి (Power) యవడంచేత ఆయనవున్నా లేనివానితో సమమే యీ వాదులకు.

కావుననే యీ ఆధునిక మానవులకు ఎన్నియుగాల క్రిందనో పూడిపోయిన పురాణగాధలున్నూ కాలం తన గర్భంలో పాతరబెట్టిన యీ చరిత్ర గాధలున్నూ ఆట్టేనచ్చలా. వీరికి నూతనంగా తెరపడలి వచ్చినా బయట అవేదృశ్యాలు కన్పడేటట్లుగా, తన జీవితంలోని ఘట్టాలుకూడా తెరమీద తన దృక్పథానికి తగిలేటట్లుగా, విశ్వామిత్ర సృష్టిలో పుట్టిన సాంఘిక చిత్రాలు వచ్చాయి. కాళ్ళు, చేతులు లేని కథ నయినా సరే సాంఘిక చిత్రమనే పేరు పెడితే బంగాళాదుంప కూర ఖర్చయినట్లు అవుతుంది. తన ప్రతిబింబం పడక గదిలోని అద్దంలో చూచుకొన్నప్పుడు కంటె తన జీవిత ప్రతిబింబం వెండితెరమీద కనబడ్డప్పుడు, పోయిన గిలక్కాయ దొరికిన శిశువువలె చిత్తభ్రమ చెంది మురుసుకుంటాడు పాపం ఈ వెర్రిజీవి.

ఊహాశక్తి క్షీణించుతోంది మానవ జాతిలో. అందుచేతనే ఎన్నో శతాబ్దాల అడుగునో బడ్డ పాతచరిత్రలను పెళ్ళగించడమంటే వీరికి తలనొప్పి. తన జీవితానికి వెండితెరను అద్దం చేయమంటాడు. పోనీ యే చేదుమందో తీపివస్తువుతో కలిపి యిచ్చినట్లు రోగికి, యే ధర్మపన్నాలో ప్రస్తుతం మాన

వుని మోరల్ స్టాండర్డుకి అందుబాటులో వుండేటట్లు యీ సాంఘిక చిత్రాలలో యిమిడ్చి ముందు పెడితే అదీ ఒక విధంగా వుంటుంది. కాని ప్రస్తుత మేదీ జరగడంలా. సాంఘిక చిత్రాలు నిజానికి మానవ జీవితానికి, మానవ విజ్ఞానాభివృద్ధికి తోడ్పడాలి. కాని, ఆపని వీనివల్ల జరుగుతున్నదా ?

లేదు. పాశ్చాత్య నాగరికతను అనుకరించడాని కలవాటు పడడం వల్లనే, మన అభిరుచులు, ఆచారాలూ, ఒకటేమిటి అన్నీ మారిపోతున్నాయి. మన న్యాయశాస్త్రం (Moral code) కంటే ఎంతో తక్కువ స్టాండర్డుకు చెందిన పాశ్చాత్య నీతిసూత్రాల్ని మన మనుసరించడం కంటె వేరే నీచ మేముంది ?

దర్శకులు కూడా కేవలం వర్తకులవలె చౌక ధరలకు చెడు వస్తువులు తెచ్చి ప్రజల ముందు పెట్టేకంటే, మన జాతీయత, మన గౌరవం; మననీతి, మన విజ్ఞానం, మన ఆచారం, వీనిని ప్రస్తుతం వున్న అధోగతినుండి పైకి తెచ్చేటందుకెందుకు ప్రయత్నించ కూడదు ? నగ్నదృశ్యాలు యువకుల కళ్ళల్లో కనబరచడమా? ఎందు కీ యవస్థ ? ఈ పోజ్ (Pose) లో ఆ క్షణం నిలబడ్డందుకు ఆ తారకు ఎంతడబ్బు యివ్వాలో దర్శకుడు. తా నెంత యాక్ట్రెస్ అయినా ఆంధ్ర స్త్రీలకు అగౌరవమున్నా, స్త్రీలోకానికి చిన్నతనమున్నా తెచ్చిన ఆతార మాత్రం ఏమంత గౌరవపాత్రురాలు. తనలో నున్న కళాకుమారినే గాకుండా తన శరీరాన్నికూడా దర్శకులకు

వి|క్రయపరచే తారలున్నారని చెప్పడానికి పై విషయం స్పష్టీ కరించాను. క్షమించండి. అజ్ఞాన కుబుసము విడువని బాలుర కున్నూ, అజ్ఞానపు కప్పట్లు కప్పుకొన్న అవిద్యావంతుల కున్నూ యీ పాశ్చాత్య (Western) సంబంధమైన లో స్టాండర్డు మొరాలిటీని కనబరచే ఫిల్ములు అపాయకరములు (Pernicious) అందుచేతనే మనదేశంలో చూపించతగ్గ ఫిల్ములు నిర్ణయించుటకై (Board of Film Censors)బోర్డు ఆఫ్ ఫిలిం సెంసార్సు అనే సంస్థ యేర్పడింది. కాని యూరపియను అనుకరణ మాత్రం మన తెరను వదలడంలేదు. వదలే టట్లు కూడా లేదని వ్రాయడానికి నాచేయి వణకుతూంది.

వెండితెరను సరియైన పద్ధతులలో వుపయోగించడానికి దర్శకులేమి ? నటకులేమి ? ప్రేక్షకులేమి ? అందరూ కంకణం కట్టాలి. వెండితెర కేవలం ఏ నాయనమ్మ కథలనో, ఏ పురాణ గాథలనో, ఏ కాశీమజిలీ కథలనో మాత్రమేగాక, అవసరమైతే ప్రజలలో ఐక్యత, జాతీయత, స్వేచ్ఛ మొదలగు వానిని గూర్చి తన చిత్రాలద్వారా ప్రబోధంకూడా చేయగలదు. మానవుని నేర్పు తనకున్న వస్తువు సరియైన పనికుపయోగించడంలో యుంటుంది. చాకుతో చెయి కోసుకొనడం వివేక హీనమని యనమూ ?(Is it not senselessness to chop one's own fingers with a knife?) ప్రస్తుతం చూడండి! దేశంలోని ఐక్యత (unity) మచ్చుకైనా కనబడుతున్నదా ? స్వాతంత్ర్య పిపాస మాత్రం కరుడు గట్టిన మన

యవకరక్తాన్ని కరిగించి కదలించి కంపించుచున్నది. కాపుననే ఆధునికకవి కాల ప్రవాహానికి ఎదురీత ఈదలేడు. దానికి నిదర్శనం ఆధునిక కవిహృదయము ఉప్పొంగిజాతీయగీతాలతో వ్యక్తీకరించుటే. అప్పరాయ కవీంద్రుడు డీరంగంలో ముందంజ వేసి చైతన్యం దెచ్చాడు.

అలాంటి పరిస్థితులలో కవులు తమకలాలను ఏ స్వప్న సుందరి దేహం మీదనో యుపయోగించే బదులు. దేశకాల పాత్రాదులను ననుసరించి, చక్కని గ్రంధాలు, నాటకాలు వెండితెరకు సరిపోయే భాషలో ఎందుకు వ్రాయకూడదు? తమ నాటకాలలో, స్వాతంత్ర్య వాయువులు, స్వాతంత్ర్య దీక్ష యెందుకు యిమడ్చకూడదు? తుప్పుపట్టిన భారత హృదయాల కేల పదును బెట్టకూటదు? ఇది శిలలు కరుగజేసే మనకవులకు దుస్సాధ్యము కాదుగదా? దేశం జీవచ్ఛవమై మృత్యుదేవత పిడికిటలో చిక్కియున్న పరిస్థితుల్లో వెండితెరపై కోయిల గిలిగింతలా? ఎంత బాగు! దేశాభ్యుదయాని కనువైన పద్ధతులను సృష్టించి, తత్ప్రచారానుగుణ్యమైన చిత్రోత్పత్తి జేసి, అవి ద్యావంతులలోనేమి? బాలురలోనేమి? తుదకు వృద్ధులలో నేమి? తనను తాను యింప్రువ్ చేసికొనే విధానం తెలుసుకొనే టట్లు ఎందుకు బోధచేయగూడదు? వెండితెర యీపనికి (Purpose) యుపయోగ పడుస్తున్నామా? లేదు. కారణం యీప్రయత్నమంతా చేదు. కాని(Bitter pills have blessed effects) చేదుమాత్రలే బాగా పనిచేస్తాయి రోగికి!

సాధారణంగా ఏ సాంఘిక చిత్రమైనా యిలాంటి ప్రచారం చేస్తున్నదా? ప్రస్తుతం. మనలో జీర్ణమై నరనరాలకు ప్రాకిన బానిసపిశాచాన్ని స్వాతంత్ర్య మంత్రములచే కూకటి వ్రేళ్ళతో పెల్లగించకూడదు? వెండితెరమీద యిలాంటి ప్రచారానుకూలమైన ఫిల్ములు చూపించి యెలాంటి కార్యాలైనా సాధించవచ్చు. కేవలం యువకులలోని ప్రేమబీజాలను మొలకరింపజేసే శృంగారరసంతో వెండితెరను తడుపుటకు మారు వారివేడిరక్తం యుప్పొంగేటట్లు చేసే వీరరస ప్రధానములైన (Social films) సాంఘిక చిత్రాలు తయారుచేయడం కాలానుగుణ్యంగా అవసరం అంతేగాని స్వాతంత్ర్య వెన్నెలల నీడన నిదురిస్తున్న అమెరికాతో మనం పోల్చుకొనడం పులినిచూచి నక్కవాతలు బెట్టుకొనడమే. అమెరికా సంవత్సరానికి * 496 ప్రేమచిత్రాలు (Romantic Films.... May I call them obscure pictures) యుత్పత్తిచేస్తోందంటే చేయవచ్చు దాని పరిస్థితు లలాంటివి. ఇకమన సంగతో ఆల్డస్ హాక్స్లీ (Aldous huxley) గారి జెస్టింగ్ పైలట్ (Jesting pilot) అనే గ్రంథంచూద్దాం

'India is depressing as no other country I have ever known. One breathes in it, not air but dust and hopelessness. The present is unsatisfactory, the future dubious and menacing' అని ధైర్యంచేసి

* A rough calculation borrowed from some weekly.

వ్రాసిన హాక్స్లీగారి వ్రాతల్లో కొంతైనా నిజం లేకపోలేదు. అలాంటప్పుడు మనమూ రొమాంటిక్ ఫిలుములే ఎక్కువ వుత్పత్తి చేయడంకంటే పైనచెప్పినట్లు ఆత్మాభివృద్ధికి దోహదమగు చిత్రాలుకొన్నైనా సృష్టించడం మంచిది. యుద్ధ రంగాలను, మిలిటరీ దళాలను తెరలపై చూపించటం విద్యుత లను ఆకర్షించినట్లు ఏప్రచారానికైన వెండితెర బాగుగా వుపకరిస్తుంది.

సూక్ష్మదృష్టితో విమర్శిస్తే వెండితెరవల్ల చాలా లాభాలున్నాయి. కళాభివృద్ధికి అవగా, గానకళ, చిత్రకళ, ఒకటేమిటి అన్ని ఆర్టులకు కూడా వన్నె తెస్తుంది. ఒక మానవునిలోని ప్రజ్ఞావిశేషాన్ని సులభంగా ప్రపంచం కళ్ళముందు పెడుతుంది. ఎడ్వర్టయిజుమెంటు చేయడంలో వెండితెరను చెప్పి మరి దేన్నైనా చెప్పాలి. ప్రపంచంలోని వివిధ దృశ్యాలు వెండితెరలో చూడవచ్చు. కవుల వ్రాతల్లోని మాధుర్యం కనులార చూడవచ్చుతెరపై. ఇవన్నీ సాధారణ మైన లాభాలు. ఇవిగాక చూడండి.

ఒక దేశస్థులు మరియొక దేశస్థులను గూర్చి తెలిసి కొనడం చాలా అవసరం యీ రోజుల్లో. రాకపోకలు, సౌక ర్యాలు వైర్ లెస్ టెలిఫోని మొదలగునవి గ్లోబుపై విదజల్ల బడిన దేశాలన్నిటిని ఒక్కదారానికి గ్రుచ్చిన యీ నవీన యుగంలో మానవుడు ప్రపంచంలోని అందరి మానవులతోను సహవాసం చేయాలి. (H. G. Wells) వెల్సుగారు చెప్పినట్లు

ఆంగ్ల భాష యనే ఖడ్గం సహాయం చేసుకొని మానవుల్లో ఒకరి నొకరు అర్థం చేసుకోకుండా అడ్డుపడిన అజ్ఞాన తెర లను ఛేదించవచ్చు. ఇన్ని సౌకర్యా లున్నా ఒక దేశంలోని ప్రజలంతా భూముఖం మీది రాజ్యాలన్నీ దర్శించడ మసంభవం. కావున వెండితెర యనే అంజనం ఒకటి వేసుకొని ప్రపంచాన్నంతా చూడవచ్చు. వెండితెర అనే విమానాన్నెక్కి బెత్తెడు భూమి వదలకుండా తిరిగిరావచ్చు. దానివలన యితర దేశాల్లోని ఆచార వ్యవహారాలు తెలిసికొనవచ్చు. సహకారం (Mutual Help) గా మనలోని 'మంచి' నిచ్చి వారిలోని మంచిని గ్రహించవచ్చును. దీనివలన మానవుని సౌభ్రాతృత్వము, విశాలహృదయత్వం (Broad Mindedness) దూరదృష్టి మొదలైన సద్గుణా లభివృద్ధి చెందుతాయి.' ఒక్క హిందూదేశమే నాది' అని గుండెమీద చేయివైచి యనే దానికంటె, ఈ ప్రపంచమంతా నాదే అని యనడం, అనగల్గడం ఎంత ఘనత ? మరియొకమాట. మానవుడు మంచిగాని, చెడుగాని తోటి మానవుడినుండి గ్రహించాలి. లేనిచో తనవంటనైనా పుట్టాలి. ఈమంచిని ప్రతివారికి బోధించడం దుస్సాధ్యం. విదేశాలనుకూడా కళ్ళముందుకు తెచ్చి, ప్రేక్షకు లనే విద్యార్థులకు వెండితెరఅనేక విషయాలను సుబోధకం చేస్తుంది. అది యెట్లుంచండి.

మానవుడు తనలోని కళను కట్టెలపాలు చేయడం కేవలం అవివేకం. విజ్ఞానాన్ని వెదజల్లడం వైజ్ఞానికుని కర్తవ్యం.

వెలుగును వెదజల్లడం సూర్యునిపని. తోటివారికికూడ తమ కళాధిక్యతను కనబరచకుండా దాచి దాచి, చివరకు కాల గర్భంలో తగల బెట్టే పెద్దలు వారి కర్తవ్యాన్ని నెరవేర్చని వారిక్రింద లెఖ్ఖ. చూడండి, ఉదాహరణకు అమూల్యమైన తమ విజ్ఞానాన్ని వాల్మీకేమి వ్యాసు డేమి పుత్తమ గ్రంథస్థం చేసి ప్రజామార్గదర్శకులై అభ్యుదయానికి దారిలీ లేదా ! వారే తమ విద్యను దాచుకొన్నట్లయితే, తన పొదుగు తాను త్రాగమరిగిన ఆవువలె, వారి విజ్ఞాన మెలా వ్యాపిస్తుంది. వారిలోని గొప్ప ఆశయాలు తోటిప్రజ లెలా గ్రహించగల్గుతారు. కాబట్టి ఉత్తమజీవిసని బల్కే మానవుడు తనలోని కళకు హారతులివ్వాలి. బహిరంగపరచాలి. చంద్రునివలె వారి వారి కళావెన్నెలలు కురిపించి తోటి ప్రజలకు ఆహ్లాదం కలిగించాలి. స్త్రీలైనా, పురుషులైనా తమ కళను మాత్రం ప్రపంచానికి అందుబాటులో యుంచాలి. ఈ కార్యసాధనకు వెండితెర దివ్యమైన సాధనం.

మానవవిజ్ఞానాన్ని లోకానికి చూపడానికి అద్దంవంటి దీ వెండితెర. పర దేశములలోని నాగరికతను దిగుమతి చేసుకోడానికి ఓడ రేవువంటి దీ వెండితెర. అటువంటి వెండితెర విలువను గుర్తెరుగక దానిని ఆడిపోసుకొనేవారి ఉసురు వారికి గొట్టక పోదు.

చిత్రమే మోగాని సినిమాలోని చంద్రోదయం నిజంగా ప్రేమవెన్నెలలనే కురిపిస్తుంది. నిజప్రకృతికంటె, కృత్రిమ

ప్రకృతి ఛాయలైన వెండితెరమీది దృశ్యాలు వేశ్యల వలపుల వలె మానవుని మరపిస్తాయి. చూడండి.

'అగ్నిసాక్షిగ నీవే నా భార్యవు నిన్ను నాహృదయంలో బంధించుచున్నాను.' అని ఒక కాంతను పెండ్లాడి, ఆమె యౌవన వసుధను త్రావి, ఆమె మానాన్ని దొంగిలించి, ఆమె హృదయాన్ని బంధించి, చివర కామె యౌవన పుష్పం వాడే సరికి, 'ఛీ కుక్కా! వెళ్లు నాయింట్లో క్షణం యుండవద్దు' అని నిర్దాక్షిణ్యంగా కల్పిత దోషారోపణం గావించి పలికిన భర్త మొగం చూడలేక విధివ్రాతను దాసోహ మని (Obeying the Destiny) ఏ జీవనదికో తన జీవా న్నర్పించే స్త్రీ యొక్క దృశ్యం ప్రేక్షకుని పిచ్చివానిని చేయకమానదు. ఏ పుష్పడోలి కలోనో, ఏ అనురాగలతలచాటునో, ఏ ప్రేమ జ్యోతి వెలుగులోనో, ఏ సుఖసంపదలలోనో తన యౌవన సుధను గ్రోలి నేడు తన పుష్పడోలిక వాడిపోయిందనీ, తన అనురాగలత వ్రాలిపోయిందనీ, తన ప్రేమ జ్యోతి ఆరిపోయిందనీ తన సుఖసంపదలు తొలగిపోయినవనీ కంట తడిపెట్టేకాంతకు, చంద్రునికూడా కనబరుచకుండా మేఘపటలా లడ్డునిలుచుంటే ప్రేక్షకుని హృదయ పుష్పము ఉపఃకాంత చేయి తగిలిన కలువగాక మరేముంది? ఉదయ చంద్రబింబంలో తన బింబం చూచి కుంకుమబొట్టు పెట్టుకొనే పడుచు ప్రేక్షకుని మానసోద్యానవనంలో కుసుమవృష్టి కురిపింపక పోదుగదా? ఏ శీతాకోకచిలుకనో చూచి భ్రమించి, ఆమె ప్రేమ వేలకొద్ది ధనం

పోసి కొని, తన బాహుబంధంలో చిక్కి యున్న ప్రియురాలి జీవితంపై నిప్పులు పోసిన మూఢుని చూచి 'నీ జీవితం నేల పాలు చేసుకొనుచున్నావా? వెర్రివాడా!' యని భావలేశ మగు పాలకుండనూ, నీ జీవితాన్ని కుక్క ముట్టిందని చెప్ప వచ్చి, భూగ్రస్తమైనపాలను నాలిక కద్దుకొనే శునకాన్నీ, చూచి బాష్పవర్షం కురిపించే ప్రేక్షకుని హృదయ ఫలకం మీది వ్రాతలు చదివితే ఎలా యుంటుందో మీరే యోచిం చండి. చివరకు యే మృత్యు ముఖంలోయున్న వృద్ధ జీవి అంత్య ఘట్టం చూచినా వెండితెరమీద జీవితమందు వైరాగ్యభావం కల్గుతుంది. ఇది సినిమా ప్రపంచపు మాయా .ప

సర్వతోముఖంగా యిన్ని యుపయోగాలు గల్గిన మన వెండితెరను వృద్ధిలోకి తెచ్చే మార్గమేది? కళాదేవికి గజ్జెలు గట్టే మార్గమేది? వెండితెరకు జాబిల్లులు వేయాలంటే మనం కొన్ని విషయాలు ముఖ్యంగా గ్రహించాలి.

దర్శకులుగాని, నటకులుగాని కేవలం ధనాశ గల్గి యుండగూడదు. కళ వారిలో మూర్తీభవించాలి. కళాసేవ కులం గాని ధనాశాపిశాచగ్రస్తులంగాదు. మహాత్మాటికీగాదు, అని వారు శుభయులు యేకగ్రీవంగా పలకాలి. పెట్టుబడిదా రులు ఎక్కువ లాభాలకు గాకుండా, కళాభివృద్ధికిగాను చక్కని ఫిల్ములు యుత్పత్తి చేయబడాలి అనే దృష్టితో తమ పెట్టుబడు లధికం చేయాలి. అంతమాత్రంచే లాభాలు నశిస్తా

యని కాదు. ఫిలిం ఎప్పుడైతే ప్రజాహృదయాలను కరిగించ
కల్గుతుందో కుబేరవర్షం అప్పుడే కురుస్తుంది. వలపు వెన్నెల
తెరలు విటునిపై కప్పే వేశ్యపైని బడే నాణెముల వృష్టిలాగు.

దేవుడు లేడనే వానికిన్నీ, కళ యంటూ యెరుగని
వానికిన్నీ ధర్మకర్తృ దర్శకత్వాలు దేనికో? దర్శకునకు కూడా
కొన్ని క్వాలిఫికేష నుండాలి. మొదటిది కళాపిపాసత్వం.
రెండవది ఆయన ఆర్టిస్టయియుండాలి. లోకజ్ఞానాన్ని బాగా
యుపార్జించినవ్వాడైతేగాని ఫిలిం స్వాభావసిద్ధం (Natural)
గా తయారుగాదు మరియొక క్వాలిఫీకేష నేమిటంటే దర్శ
కుడు తాను స్వేచ్ఛావాంఛియైనా, కాకపోయినా నటకజన
సంపూర్ణస్వాతంత్ర్యదాత గావాలి. ఫిలిం సాంగోపాంగంగా
తయారయిందాకా నటకులకు (ఆ ఫిలింలో యాక్టు చేసే నట
కులకు) సంపూర్ణ హక్కులతో స్టూడియోస్థాన్(Studiosthan)
వ్రాసి యివ్వాలి. స్వాతంత్ర్యంలేనిది నటకులు తమ కళా ప్రద
ర్శనం చక్కగా చేయలేరు. చూడండీ! పంతుల చేతిలో బెత్త
ముంటే కుర్రవానికి నోటి వెంట మాట వస్తుందేమో.
కాబట్టి ఫిలిం బాగోగులు చాలావరకు నటకుల నెత్తిన
బెట్టాలి. ఈ యజ్ఞసంభారాలన్నీ కూర్చడం, పాత్రౌ
చిత్యానికీ, అందచందాలకు తగిన నటకులను వెదకి సంపా
దించడం, ఫిలిం గొప్పఆశయాలమీాద నడపడం, నవ
రసాలు అనువైన పరిమాణాలతో (In fixed quantities
so that the taste may not die away) తన చిత్రంలో

యిమడ్చడం మొదలైనవి దర్శకుడు గమనించవలసిన విష యాలు. అంతేగాని తాను 'సారథి'ని గదా యని నటకులను అశ్వాలుగా చేయడం నిరంకుశ ప్రభుత్వం. దర్శకుడుకూడా నటకుడైతే ఫిలిం తేనెలోమాగిన ద్రాక్షపండే. ఇవి స్టూడియో సంసార రహస్యాలు.

ప్రస్తుతం నాట్యకళ వెనుకడుగేస్తోందంటే దానికి కార ణం, అది అల్లులేని తీగకావడమే. దానిలో జీవమున్నా రాణించక వెర్రితలలు వేస్తుందంటే, దానికి కారణమనాదరమే. మనపిల్లలు చదివేచరిత్రల్లో, చరిత్రకారులు వ్రాస్తూయుం టారు మన పూర్వరాజులు కవులకు ఛత్రాలు పట్టారనీ, గాయకులకు కాగడాలు వేశారనీ; ఇకముందు రాబోయే చరిత్రల్లో మనపిల్లలు ఏం చదువుతారో కవిగాయకులను గూర్చి. కళాపోషణ (Bringing-up of fine arts) ప్రభుత్వం ముఖ్యకర్తవ్యం గడచినరోజుల్లో. నేడో? ఇది వ్యాపార యుగమవడంచే యీ కళాపోషణలో లాభమంటూ లేదని ప్రభుత్వాలు కనిపెట్టాయి. అదీగాక, పూర్వం ఏ హర్షుడో కళాదేవి నెత్తుకు తిరగాడంటే ఆమె అప్పుడు శైశవావస్థలోనో బాల్యావస్థలోనో యుంది. ఇప్పుడో, కళాదేవి నడియావనంలో యుందని ప్రభుత్వ మామెనుగూర్చి అటే శ్రద్ధ చూపడంలా. యావనంలోనున్న కళాకాంతను ఆదరించడం, అలంకరించ డంలో గల సంతోషం, సద్గ్రహించలేని స్థితిలోయుంది గాబోలు పాపం ప్రభుత్వం.

మస్థితిలోనున్న నటులను బాగుచేసి వారి ఆర్థిక, మానసిక పరిస్థితు లభివృద్ధిపరచి వారిలో దాగియున్న కళా ప్రతిభను మెరుగుపెట్టాలి. పేరొందిన గాయకులను నటకులను వారిలోయున్న విలువనుబట్టి వారినిసత్కరించి వారికి ప్రపంచంలో తగినస్థానం యివ్వాలి. గానకళ, నాట్యకళ, అధోపతన మవడం చేతనే (High class-people) అంటే 'Haves' అనగా ధనం గలవారు, అభిమానమే మా ధనం సిగ్గే మా సిరియని చెప్పికొందరు స్త్రీలు కూడా, సినిమా ఫీల్డులో కాలుపెట్టడం లేదు. అంటే సినిమా తెరలపై కవబడే నారీమణుల కభిమానం లేదని యనే ద్రోహిమెవడుంటాడు? ఏ దృష్టితోచూచినా స్టూడియోస్టాన్ మొరాలిటీ హైస్టాండర్డులోకి తీసుకరావాలి. తమలోయున్న కళావిశేషాన్ని అభిమానమనేపేరకాలగర్భంపాలుచేస్తున్న (Highclass) కులీనులగు స్త్రీలను కూడా సినిమాతెరపైకి తేవాలి.

ధైర్యంచేసి రంగంపై నోరుతెరువ కల్గిన నటీమణులకు అదిగమవించిన సంగీతకళ, నాట్యకళకల్గిన నారీరత్నాలు ఎందరు తమఘోషామసుగుల్లో వట్టివేళ్ల విసన కర్రలకూ తమ పడకగదులలోని మంచాలకూ, వంటింట్లోని పొయిగడ్డలకు స్నానపుగదులలోని సబ్బుపెట్టెలకు తమ "సంగీతరసధారాస్రవంతి" చే స్తవస చేయడం లేదు. ఆ విసనకర్రలు, ఆ పట్టుమంచాలు, ఆ పొయిగడ్డలు, ఆ సబ్బుపెట్టెలు చేసుకొన్నపుణ్యం. భగవంతుడు స్వయంగా సృష్టించిన యీవ్యక్తి

గత జీవాలకు లేదు గాబోలు! అలాంటి సంగీతసాహిత్యాలు గల్గిన కాంతామణులకు ఏ పాత్రో యిచ్చి తెరపైకి తెచ్చివారి గానధారలను ప్రేక్షక జనానికి పంచాలి. వారి నాట్యకళ ప్రభావం ప్రేక్షకులను మత్తమధుపాలొనర్చాలి. దీనికంతటికీ వెండితెర కేవలం కళారంగమే కావాలి.

రంగస్థలం కల్లుదుకాణమనీ, వేశ్యాగృహమనీ, అబ్బబ్బా! ఏమేమో ఆడిపోసుకునే వాళ్లకు బుద్ధిచెప్పాలి. అని ప్రజా సామాన్యాలుకూడా స్టూడియోల విలువ గ్రహించి, స్టూడియోలలో చేరి కళాసేవ చేస్తామని బయలుదేరాలి. పాశ్చాత్య దేశాల ఫిలిం పరిశ్రమలతో పోటీచేయతగ్గ పరిశ్రమలు సాగించాలి.

సంగీత పాటకులకు సాహిత్యమూ అవసరమే. కంఠ మెంత మధురంగా యున్నా, వాక్శుద్ధి లేని గాయకుడు బయట పడకతప్పదు. ఆతని గానం ఉప్పు లేనిపప్పే. వళ్లు తెలియనిభజనలలో సాహిత్యరాహిత్యంచే 'నారాయణుడు పక్షివాహనుడై, వెడలె' మొదలగు చక్కని కృతులను నారాయణుడుపక్షీ నారాయణుడుపక్షీ అంటూ వెర్రిధోరణితో ఎగిరే భక్తుల లాగ నటకాగ్రగణ్యులమనే కొందరుగూడా తమకువచ్చీరాని సాహిత్యధోరణితో రంగస్థలం తమకాలుక్రింద యున్నదిగదా యని పద్యములనుకూడా 'రామునితోక — పివకుండిట్లనియె.' అని చదవడం ప్రారంభించడం వారి కళావిజ్ఞానాని కెంతలోటో గుర్తిస్తున్నారా?

నాట్యకళను కొన్నికట్టుబాట్లలో పైకితెస్తేగాని దానికి ప్రపంచం విలువనివ్వదు. ముఖ్యంగా గళం మంచిదై జన్మతా సంగీతం వచ్చినవ్యక్తిని ఆ ఫీల్డులో పైకితేవాలి. అలాంటి వ్యక్తి దానిలోని మెళుకువలు "కులవృత్తికి సాటిలేదు గువ్వల చెన్నా" అన్నట్లుతనవృత్తిలో కనిబెట్టిన సుళువువలె గ్రహిస్తాడు అంతేగాని గార్ధభానికి కళ్ళెంబెట్టినట్లు, కంఠమాధుర్యం లేని ప్రతివానికి గానవిద్యలో స్థానమీయడం. తప్పు. ఈకాలంలో హార్మోనియంపై చెయివేయకుండా భార్యాత్వంపొందిన యువతి లేదనడంలో అతిశయోక్తిలేదు. గంజినీళ్ళకు లేని నిరుపేదకూడా ఎవరిపెట్టినయినా బదులుతెచ్చి తన కుమార్తెలచే సంగీతం తినిపిస్తాడు. అదివారికి జీర్ణమయే విషయం తనదిగాదని తెలుసుకుంటాడు. ఏ యువకునకో ఆమె యావనధనం కట్నం తోకూడా యిచ్చేదాకా యీ తతంగాలన్నీ, నూటికి యే పది మందో లేక అందులో సగమో హార్మోనియంతోసహా కాపరానికి పోయేది. అలాకాకుండా—

విద్యాకళాశాలలు పెట్టినట్లే కేవలం సంగీతకళాశాలలు కూడా పెట్టాలి, అందులో దాక్షిణాత్య సంగీతం, అధునిక సంగీతంకూడావృద్ధిపరిచే యేర్పాట్లుండాలి. నర్తనం (Dance) భావప్రదర్శనం, ఏకపాత్రాభినయ ప్రదర్శనం ఆర్కెష్ట్రాలో వివిధభాగాలసాధన మొదలగునవి కళాశాలలో బోధనావిషయములైయుండాలి. సంగీతానికి కావలసిన సాహిత్యంకూడా ఆకళాశాలలోనే నేర్పేసదుపాయాలు కల్గించాలి. ఈ కళా

శాలలో తర్ఫీదుపొందిన నటకులు, నటీమణులు, కూడా రంగ స్థలాలకు వెండిరథాలు పట్టగలరు.

వయసుతో నిమిత్తంలేని యీ కళాశాలా కళారాధకులే వెండితెరను రత్నాలతెరగా మార్చగలరు. అలా నాట్యకళాశాలలు స్థాపించి అందలి విద్యార్థులకు సంగీతసాహిత్యాలే కాకుండా, స్త్రీని పురుషుడు ఎలా గౌరవించాలి ? పురుషుడు స్త్రీని ఎలా గౌరవించాలి? తాత్కాలిక దంపతులై ఒక క్షణకాలం వెండితెరపై కులికిన ఒక నటునకు తారామణికీ గల సంబంధమేమి? తరువాత వారిరువురు తమజీవితాన్ని ఎలాగడపాలి? మొదలగు విషయాలుకూడా వారికి సుబోధకం చేయాలి. వారిలో యుండే నీచభావాలు కోసి వేయాలి. (Morality) మొరాలిటీని హైస్టాండర్డుకు తేవాలి. వైద్యకళాశాలలు (Medical colleges) వ్యవసాయ కళాశాలలు(Agricultural colleges) టెక్నికల్ కాలేజెస్ యింకా అనేక కళాశాలలు నిర్మించి దిగ్విజయంగా నడుపుచున్న మనం నాట్యకళాశాల స్థాపించలేమా ? ఈ కళాశాలలో థియొటికల్, ప్రాక్టికల్ కోర్సులు కూడా వుంటాయి. (Film producing Technology చిత్రోత్పత్తికి సంబంధమైన పరిశ్రమలు కూడా ఒక సబ్జెక్టుగా తీసుకోవచ్చు. ఒక్కొక్క ఫిలిం (మూగ ఫిలిం కాదు మాటలు నేర్చిన ఫిలిం) తీయాలంటే చూడండి ఎందరు (Artists) కళానైపుణ్యులు కృషిచేయాలో.

ముఖ్యంగా కథ, డైరెక్షన్, వచనము, పాటలు, సంగీతము, నృత్యములు, ఛాయాగ్రహణం, శబ్దగ్రహణం, కళాదర్శనం, వాద్యగోష్ఠి, ఆర్టు డైరెక్షన్ మొదలైనవి వేరువేరు కళానిపుణులు నిర్వహించాలి. ఆ యా కోర్సులలో వారికి ఏ కొద్ది నెలలో కళాశాలలో (College) శిక్షణయుంటే ఫలుం బంగారం గాక మరేముంది. కాబట్టి మనం నాట్యకళాభివృద్ధికి పాటుపడాలి. నాట్యకళాశాల ముఖ్యమని తెలుసుకొని దాని స్థాపనకై ముఖ్యంగా నటకులు కళా పిపాసకులు మొదలగు వారు కృషి చేయాలి.

కళామందిరాలు, లలితకళాశాలలు (పైన చెప్పిన సంగీత కళాశాలలు లేక నాట్యకళాశాలలు) ముఖ్యం. నాట్య కళారాధన తేలిక కాదన్న విషయం ప్రజాసామాన్యానికి చాటాలి. భౌతిక దేహాభివృద్ధికి ఆహార మెట్లో, మానసిక పరిణామానికీ, హృదయ పరివర్తనానికీ కళాదర్శన మట్లే.

ఉదాహరణకు, ఎంతమంది పురుషులు తమ సంసార సముద్రంలో తమ కందని కష్టతరంగాల నెదుర్కొన లేక పిచ్చెత్తి (In delirious state) వెండితెర పాదాల మీద వాలిపడం లేదు? మానసిక నైర్మల్యం కొరకు? ఎంతమంది యువతులు తమ లవ్ సిక్ దినాలలో తమ కన్నీరు వెండితెరతో తుడుచుకొన లేదు? ఎంతమంది నిరుపేదలు తమ దుఃఖ భాజక మైన జీవిత పోగలకు తాళలేక ప్రాణముల నమ్మియైనా వెండితెర మీది ఛాయాలోకాన్ని దర్శించి నిష్కల్మష మానసు

లవడం లేదు. నిరాదర పాత్రులై కర్మ వశముచే బంధువులను కూడా వదలి తిరిగి సంసార సుఖం చవి చూచుటకు వీలులేని పరిస్థితుల్లో ఎందరు మానవులు వెండితెర నాశ్రయించి విరుగుడు పుచ్చుకొనుటలేదు ? ఎందరు తమ జీవితరథాలను ముళ్ల దారులలోకి లాగి తిరిగి వెండితెర చూపిన సరియైన రాజ బాటల కెక్కడం లేదు? నిరక్షరకుక్షు లెందరు విజ్ఞానాన్ని వెండితెరనుండి గ్రహించడం లేదు ?

ఇంత మానవసేవ చేస్తున్న కళాకాంతకు తగిన స్థాన మివ్వడం మన బాధ్యతకాదా! కళాజ్యోతి వెలుగులలో భజనలు చేసి తమ పొట్టలు నింపుకొనే కళారాధకులందరూ దీనికి ప్రయత్నించుచున్నారా ? మన ఫిల్ములు వృద్ధిలోకి వచ్చే మార్గ మాలోచించడం మనకర్తవ్యం.

లండన్ వంటి విదేశప్రాంతాలలో మన ఫిల్ములు ప్రదర్శింప బడడం మన కెంత ముదావహం ?—

'మజ్దూర్ మజ్లిస్ వారి అధ్వర్యాన లండన్ ఈస్టెండ్ ప్రాంతంలోని బ్రిక్ సందులోని మేఫెయిర్ సినిమా హాలులో ప్రభాత్ వారి పడోసీ ప్రదర్శితమైంది. ఐదువందల భారత కార్మికులు సందర్శించారు. కవెంట్రిలోని ఓడియన్ సినిమా హాలులో కూడా త్వరలో అది ప్రదర్శింపబడనున్నది.' అని మన పత్రికలు మన కళా కుమారిని గూర్చి పలుకుతూంటే 'నాన్నా ! అన్నయ్యకు నోబుల్ ప్రైజ్ వచ్చింది.' అని పలికే

చిన్న కుమారుని పలుకులలో తండ్రికి కనుపించే. తేనధారలు ఏ కళారాధకునకు కనుపింపవు.

కాబట్టి దర్శకులేమి, నటకులేమి, నటీమణులేమి, కళా ప్రియులేమి, వ్యాపార లాభాలకుగాక, కళారాధన యొక్క అత్యుత్తమాశయాలు గ్రహించి కళాపూజ ప్రారంభించాలి. కళారాధన వల్ల సాధించే యుత్తమ కార్యాలు చాలా యున్నాయని గ్రహించాలి. అంతటితో చాలదు. అట్టి కార్య సాధనకు హృదయ పూర్వకంగా పూనుకోవాలి. కళారాధనా నిమగ్నుడై నటకుడు తన్మయుడు గావాలి. అదే ధన్యతకు మార్గమని తాను గ్రహించాలి. త్యాగయ్యవలె తమ కళా ప్రతిభతో, తమ గాన మాధురీ ఝురులతో ప్రేక్షక రసికుల నుర్రూత లూగించాలి. ప్రతి నటకుడు, నటీ కళాదేవి అప రావతారం గావాలి. ఆదర్శ శిల్పకారుడు తన శిల్ప నిర్మా ణంలో పొదిగే లావణ్యం, చిత్రకారుడు తన చిత్తరువులో పొదిపే నేర్పు, ఉత్తమ కవి తన పదములలో యిమిడ్చే పొందిక, ఉత్తమ నటీనటకులు తమ పోకళ్లలో కుమ్మరించాలి. తావికీ పూవుకీ వలె నటకునికీ ప్రేక్షకునికీ గల అవినాభావ సంబంధం గ్రహించి, సమాజం తన కిచ్చే గౌరవం తనయందు చూపే యాదరణ నిలబెట్టుకోవాలి. ఆనాడే సమాజమర్థించే యున్నతవాంఛ, ఆశించే యుత్తమాశయం ఫలిస్తుంది, తారలు తమ కళాసేవ వల్ల, ఆదర్శ జీవితాలవల్ల ప్రేక్షక సమాజాన్ని అభ్యుదయ మార్గాలలో నడిపించాలి. ఈ యుత్తమోత్తమ

స్వప్నాలు నిజాలు చేయాలంటే ప్రతి నటీ, ప్రతి నటకుడు కల్పితరంగం మీద రంగు తెరల వెనుకేగాక, తమ జీవితరంగం మీద కూడా ఆదర్శ జీవనం గడపాలి. రంగం మీద సమాజాన్ని మెప్పించినట్లే జీవితరంగం మీద కూడా సంఘం మెప్పువడయాలి. సంఘం చల్లే పుష్పబాటల్లో ఆదర్శప్రాయులై నటకులందరు నృత్యమాడాలి.

"మాకీతుచ్ఛభౌతిక సౌఖ్యాలు అక్కర లేదు. మమ్మాదరించే సమాజం యొక్క సుఖమే మాసుఖం. మాకు ధన పిపాసవద్దు. కళాపిపాస కావాలి. యావజ్జీవం కళాకాంతపాదాలకు కుసుమపూజ చేయుటకే యీ రంగంపై కాలు బెట్టాము అని ప్రతి తార తన తన్మయావస్థలో చాటాలి. ప్రపంచ నాట్య రంగాన్ని దర్శించే నిర్లిప్త దర్శకుడు సైతము ఆ తన్మయావస్థలో తన యొడలు తాను మరవాలి.

"సజీవమానవ మానసిక యంత్రాలకు నవరస దాతలం మేము. అంతేగాని అభినయ సంగీతాలు తులదూచి విక్రయించే వ్యాపారులంగాదు" అని గొంతెత్తి అరవాలి. ప్రతినటి ప్రతినటకుడు. దానితో నిర్జీవశిలలు సైతము సజీవములై చిగిర్చాలి; కరగి కదలాలి;

"ప్రపంచరంగంపై ప్రాకులాడే కపట వేషధారుల వంటి కృత్రిమ రంగసంచారులుగు వేషధారులంగాదు మేము. సృష్టిలోని మధుర సంగీతరసాన్ని నవరసమర్దన గావించి, అభినవ నాట్యోపరసంతో కళాపిపాస పీడితులగు ప్రేక్షకసమాజంచే త్రాగిం

చువారలం" అని వేనోళ్ల చెప్పాలి. ప్రతినటుని ఆశయం కళా పూజయే గావాలి. కళాలక్ష్మి నటీనటుల ముఖపద్మాలలో మూర్తీభవించాలి. కళాపూజ, కళాపిపాస, కళారాధన, కళాభివృద్ధి....యిదే ప్రతినటుని హృదయఫలకంమీద శిల్పాక్షరాలతో చెక్కాలి.

ఆనాడే మనఫిల్ములు జగత్తంతా నాట్యంచేసి ప్రజా హృదయరంజకాలవుతాయి. మనదేశం కళామందిర మౌతుంది. మనం కళారాధకుల మౌతాము.

ఇదే మనకర్తవ్యం. ఇదే కళారాధకులమగు మనధర్మం.
ఇదే కళాపిపాసులమగు మనఆశయం.

Printed at Janakiram Press, Tenali, Q. H. No. G. 38. From Page 1 to 24 and at Kalyani Press, Tenali, P. I. C. G. 79 A From Page 24 to the completion of the book. For Viswagna Mandali, Tenali P. I. C. G 76—250 copies.

